# బంజారా సంస్కృతి - సాహిత్యం

## (A study of Banjara Tribe)






డాక్టర్ కె. ఓబిరెడ్డి
శ్రీ కృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం.

# బంజారా సంస్కృతి - సాహిత్యం

(*A study of Banjara Tribe*)





డాక్టర్ కె. ఓబిరెడ్డి
శ్రీ కృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం.

సర్వహక్కులు : రచయితవి
ప్రతులు : 500
ప్రథమ ముద్రణ : 1991

వెల : 25-00



ప్రతులకు :

శ్రీమతి కె. వరలక్ష్మి
షిరిడి సాయి ప్రచురణలు
17/370 డి. 4-2
శ్రీ సాయినాథ నిలయం
నీరుగంటి వీధి
అనంతపురం – 515 001.

ముద్రణ :

శ్రీ శారదా ప్రింటింగ్ ప్రెస్
కమలానగర్, 14-595
అనంతపురం.







అభీష్ట ప్రదాత, కారుణ్యమూర్తి, పావనమూర్తి, భక్తవత్సలుడు,
దీన బాంధవుడు, ద్వారకామాయి వాసుడగు సమర్థ సద్గురు
శ్రీ షిర్డి సాయినాథునికి అంకితం.

# కృతజ్ఞతా కుసుమాంజలి



"బంజారా సంస్కృతి - సాహిత్యం" అనే రచన చేయదలచి అడిగినప్పుడు సహృదయతతో ప్రోత్సహించిన గురువర్యులు ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు, డాక్టర్ పి.ఎల్. శ్రీనివాసరెడ్డి, డాక్టర్ యం.కె. దేవకి గార్లు .... ....

పుస్తక రచన విషయంలో తగిన సూచనలిచ్చి తోడ్పడిన గురు తుల్యులు శ్రీ బండ్లపల్లి ఓబులరెడ్డి, శ్రేయోభిలాషులు డాక్టర్ ఆర్. శేష శాస్త్రి, శ్రీ డా॥ ఏ.వి. ప్రసాదరావు శ్రీ గోనా నాయక్, శ్రీ బి. చీన్యా నాయక్, శ్రీ వి. గోపాలరావు నాయక్ గార్లు, ఎంతోమంది రచయితులు, విమర్శకులు, సాహితీప్రియులు, ఆంధ్రభారతి అధ్యాపక బృందం .... ....

నేను అడిగిన వెంటనే పనులన్నింటిని వదలిపెట్టి శ్రమ అను కోకుండా పాటలను పాడిన వివిధ తాండాలలోని బంజారాలు, వారి కుల పెద్దలు .... ....

పుస్తక రచనలో తగిన సలహాలను, సూచనలిచ్చి, తమ అమూల్యాభిప్రాయాలను వ్రాసి యిచ్చిన డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద గారు .... ....

పుస్తక ముద్రణకు సంబంధించిన సర్వబాధ్యతలు స్వీకరించిన డా॥ ఆర్. రాములు, శ్రీ శారదా ప్రింటింగ్ ప్రెస్ కార్మిక బృందం.... ....

ఈ పుస్తక రచనలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తోడ్పడిన మిత్రులు, శ్రేయోభిలాషులు .... ....

వీరందరికి నా హృదయ పూర్వక నమస్సుమాంజులులు. బంజారా భాష వ్రాసుకోవడంలోను, ముద్రణలోను ఏవైనా లోపాలుంటే క్షమించ కోరుతూ .... ....

కె. ఓబిరెడ్డి

డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద
ఆంధ్రభారతి
శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం – 515 003.

# గిరిజనుల అధ్యయనం

విశ్వ విద్యాలయ తెలుగు శాఖలో గత 5 దశాబ్దాలుగా జరిగిన భాషా సాహిత్య కృషిలో కొన్ని పరిణామాలు వచ్చాయి. సంస్కృత సాహిత్యం నుండి దేశివైపు. దేశిలో జానపదం వైపు, అందులోనూ జానపద విజ్ఞానం వైపు, పండితుల దృష్టి మారుతూ రావటం ప్రధాన పరిణామం. మరొకటి రాజకీయ సంస్కృతిని పరిశీలించటం. ఇవి రెండూ కాకుండా గిరిజనుల సంస్కృతిని గురించిన పరిశోధన కూడా ప్రవేశించింది. అబ్బెడూ బోయిస్, గ్రియర్సన్, థర్సటన్ మొదలైన యూరోపియనులు కల్గించిన ఆసక్తితో భారతీయులలో కూడా గిరిజనుల మీద అధ్యయనం చెయ్యాలన్న తపన గత శతాబ్దంలోనే మొదలైంది. గిడుగురామ మూర్తి పంతులు (1863–1940) 1892 ప్రాంతంలోనే మాళవా పర్వత శ్రేణుల్లో నివసించే సవరల మీద ఆసక్తి చూపారు. అసలు వాళ్లు మానవులేనా! అని సందేహించే రోజులవి. వాళ్ళు మోసగాళ్ళని, మనుషుల్ని బలి ఇస్తారని, రాక్షసులతో సమానమని అందరూ భావిస్తున్న రోజుల్లో రామమూర్తి గారు వారిమీద సానుభూతితో వారిని మనుష్యులుగా మార్చాలని దీక్షతో పరిశోధన మొదలు పెట్టారు. వారిని తన ఇంటిలోకి రానిచ్చి, భోజనం, బట్టలు పెట్టి, పొగాకుకు డబ్బులిచ్చి, వారి సంప్రదాయం ప్రకారం స్నేహంచేసి, వారి భాషలోని పదాలను కొన్ని ఏళ్ళ తరబడి నేర్చుకొని, భాషమీద అధికారం సంపాయించి, వారి సమాజం కట్టుబాట్లను అధ్యయనం చేసి, వారి జాతి వెనుకబడి వుండటానికి కారణాలు అన్వేషించి, వారికి వారి భాషలోనే చదువు చెప్పించి తీరాలని, అపుడే వారిలో మార్పు వస్తుందని ప్రభుత్వానికి 1894 ప్రాంతంలో రిపోర్టు పంపిన వారు ఆయన.

తన డబ్బులతో వారికి బడిపెట్టి. తన కొడుకు సీతాపతి గారినీ తన మార్గంలోకి తిప్పుకొని, సవరల విద్యాభివృద్ధికోసం 1933 ప్రాంతం వరకు నిరంతర కృషి చేశారాయన. ఆయన రచించిన సార మాన్యువల్, సార తెలుగు, అంగ్ల నిఘంటువులు చాలా విశిష్టమైన గ్రంథాలు. ఒక జన జాతి మీద పరిశోధన చేయదలచిన వారికి కరదీపికలవి.

రామమూర్తి గారి తరువాత జానపద విజ్ఞానం మీద చూపినంత శ్రద్ధ గిరిజనులపైన, ఇతర జన జాతులపైన పరిశోధకులు చూపలేదు. ఒక్క వెన్నెలకంటి రాఘవయ్య గారు మాత్రం 'యానాదుల' పై విస్తృతంగా పరిశోధించారు. విశ్వ విద్యాలయాలలో ఎవరూ పరిశోధన చేయలేదు. చెంచుజాతి వారిమీద కూడా పరిశోధన జరగలేదు. ఎరుకల వారిమీద ఇటీవలే మొదలైంది.

ప్రభుత్వం వారు, యు.జి.సి. వారు గిరిజన చెయ్యండని పరిశోధనలు ఎంతగా ప్రోత్సహిస్తున్నా తగినంత ప్రతిస్పందన పరిశోధకుల నుంచి కనిపించటం లేదు. కారణం ఒక్కటే. గిరిజన పరిశోధన చాలా వ్యయాన్ని ప్రయాసను కల్గిస్తుంది. ఈ కష్టాన్ని తట్టుకొని అడవుల్లో, కొండల్లో తిరిగి గిరిజనులతో కలిసిమెలిసి వారిని అధ్యయనం చేసే తత్వరత చాలా తక్కువ శాతం పరిశోధకుల్లో వుంటుంది. పుస్తకాలతో కుస్తీపట్టి మస్తిష్కాలకు మస్తుగా పనిపెట్టే పండితులే ఇంకా తెలుగు శాఖల్లో అధికంగా వున్నారు. వారి దృష్టిలో అసలు జానపద సాహిత్యమే నియమ రహితం. మరి గిరిజనుల విషయం-ఆలోచన కూడా చెయ్యలేరు. ఈ స్థితిలో కూడా ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారు 'కొండ' భాష మీద చేసిన కృషి (1960 – 69) ప్రేరణగా నేను 'బంజారా' భాష మీద 1976 లో పరిశోధన మొదలు పెట్టాను. గుడ్డెద్దు చేనులో పడ్డట్టు దొరికిన దారిలో పోగా పోగా 1983 తరువాత భారతదేశంలో 17 రాష్ట్రాలలో, 27 పేర్లతో, 58 గోత్రాలతో పిలువబడే ఒక జన జాతి వుందని, ఆ జాతినే 'బంజారా' అని మనం పిలుస్తున్నామని అర్థమయింది.

ఆ నేపథ్యంలో 'గోర్ బోలి' అని పిలవబడే వారి భాషా స్వరూపం ఏమిటో అర్థం చేసుకోవటానికి 5 సంవత్సరాలు పట్టింది. రాజస్థానీ కేంద్రకమైన హిందీ భాషకు జాతి పరమైన వ్యవహార నామమే 'గోర్ బోలి'. బంజారాలు తమనితాము 'గోర్' అని, ఇతరుల్ని 'కోర్' అని పిలుస్తారు, అంచేత 'గోర్బోలి' ఒక ప్రత్యేక భాష కాదు - హిందీలో ఒక ప్రభేదమే. కొన్ని కొన్ని ప్రాచీన లక్షణాలు ఆ భాషలో మిగిలి పోయాయని నేను గుర్తించ గలిగాను.

భాషను గురించి ఎంత సూక్ష్మంగా తెలుసుకో గలుగుతామో వారి సంస్కృతి, చరిత్రల్ని, సాహిత్యాన్ని, జానపద విజ్ఞాన్ని కూడా అంతే లోతుగా గుర్తించ గలుగుతాం. అందుకే గిరిజనాధ్యయనం "నీటి కొద్దీ తామర" – ఎంతలోతు దిగితే అంత గంభీరంగా కనిపిస్తుంది.

ఒక ఉదాహరణం చూడండి. బంజారాలు తాము రాజుపుత్రుల మని చెబుతారు. ఏవో కొన్ని కథలు చెబుతారు. ఇవన్నీ 'Legends' తప్పా చారిత్రక సత్యాలు కావు. కాని ఎలా నిరూపించాలి! డా॥ ఓబిరెడ్డి సేకరించిన విషయమంతా 'వినుకలి' లోనిది మాత్రమే. మహారాష్ట్ర, రాజస్థాన్, గుజరాత్, పంజాబ్, యూరోపియన్ 'సింతీ' (జిప్సీ) ల చరిత్ర మీద క్షుణ్ణంగా అధ్యయనం చేస్తే తప్పా ఈ సమస్యను పరిష్కరించలేము.

కీ.శే. ఆచార్య శ్రీరామ శర్మ (ఉస్మానియా విశ్వవిద్యాలయం) గారు బంజారా గోత్రాల్ని అతి శ్రమకు ఓర్చిరాబట్టారు. 58 గోత్రాలు దొరికాయి. రాజపుత్రుల గోత్రాలలో దాదాపు 22 మాత్రమే సమన్వయిస్తున్నాయి. తక్కిన గోత్రాలు తరువాతి కాలంలో ఏర్పడ్డాయనటంకన్నా రాజపుత్రులతో సంబంధం అనంతర కాలంలో బంజారాలకు కల్పించబడిందనటమే సమంజమని వారు భావించారు. ఆయన గ్రంధం 'బంజారా సమాజ్' (1983) రాసినప్పటికి అది ఊహ మాత్రమే. 'క్రిస్టాఫర్ క్లాడ్' అన్న ఫ్రెంచి పరిశోధకురాలు (1985) బంజారాల వలసల్ని గురించి అద్భుతమైన గ్రంథం రాసింది. అలాగే 'కొకనోవ్స్కి' అన్న ఫ్రెంచి పరిశోధకుడు (1965 – 85) కూడా బంజారాల మీద విస్తృత పరిశోధన చేసి

యూరోపియన్ జిప్సీ (రామానీభావే) లకు ఇండియాలోని బంజారాలకు సగోత్ర సంబంధం వుందని, భాషాపరమైన నిరూపణలు చూపించారు. ఇదే మార్గంలో నేను కూడా ఈ రెండు భాషల నడుమ సగోత్ర సంబంధాన్ని గుర్తించాను. ఈ సంబంధం సంస్కృతీ పరమైన ఆచార వ్యవహారాల్లో ఇంకా సజీవంగా మిగిలే వుంది. కొకనోవ్‌స్కీ బంజారాల రక్తం గ్రూపులను జిప్సీల రక్తం గ్రూపులతో అన్వయించి కూడా శోధించాడు. బంజారాలు కూడా జిప్సీల్లాగానే "సిథియన్" కుటుంబానికి చెందిన ఒక జన జాతి అని, మధ్య ఆసియా ప్రాంతం నుంచీ వలస వచ్చారని, ఆయన సమగ్రంగా నిరూపించారు. అంచేత బంజారాలు ఇండియాలోకి క్రీస్తుకు పూర్వమే ప్రవేశించి, సార్థవాహులుగా పంజాబ్ ప్రాంతం గుండా పర్షియా మీదుగా, జెరూసలెమ్ దాకా ప్రయాణస్తూ ఉండేవారని, మొదటిసారిగా 'సింతీ' అనే పేరుతో ఒక తెగ; రెండోసారిగా 'లమాణ' అనే పేరుతో మరో తెగ; తరువాత తరువాత "బంజారా" అనే పేరుతో మరోతెగ అటు యూరప్ లోనూ, ఇటు దక్షిణ పశ్చిమ ఇండియాల్లోనూ వ్యాపించారని కొకనోవ్‌స్కీ నిరూపణ. ఈ మూడో వలస సమయంలో (క్రీ.శ. 11వ శతాబ్దంలో) రాజపుత్ర కుటుంబాలతో వీరు కలసిపోయి, వారి గోత్రాలు వీరికి సంప్రాప్తించాయని ఈనాటి పరిశోధనల సారాంశం.

"గిరిజన పరిశోధన" ఎంత క్లిష్టమో సూచించడానికి ఈ ఉదాహరణం చర్చించాను. కేవలం 'ఎకడమిక్' ప్రయోజనాల కోసం గిరిజనుల స్థితిని **'Exploit'** చెయ్యటం వల్ల మనకి లాభముండదు – వారికి ప్రయోజనముండదు. అంచేత ఎంతమంది ఎంత శోధించినా, ఎన్ని గ్రంథాలు రాసినా, రాసినవారు. ప్రొఫెసర్లయినా, గిరిజనుల స్థితిగతుల్లో మాత్రం మార్పు రాలేదు. ఎక్కడి వేసిన గొంగడి అక్కడే వుంది.

బంజారాలు సంచార జీవనం నుంచీ స్థిర జీవనానికి అలవాటు పడటానికి దాదాపు 2000 సంవత్సరాలు పట్టాయి. "క్రిమినల్ ట్రైబ్"గా గుర్తింపబడ్డ వీరు మనుషులుగా గత 5, 6 దశాబ్దాలుగానే పరిగణింపబడుతున్నారు. అంచేత ఈనాటి వారి ఆవశ్యకత, తిండి, నీరు, గుడ్డ, గూడు ఇవి తీరాక మా పిల్లల చదువు విషయం ఆలోచిద్దామంటారు. ఇది వారికి ఒక సంధి దశ.

అంచేతే గిరిజన పరిశోధనలు ఇప్పటికీ ఇండియాలో 'ప్రిమెచ్యూర్' గానే వున్నాయి. కాని మొదలయినందుకు మనం సంతోషించాలి. యువ పరిశోధకుల్ని ప్రోత్సహించాలి,

డాక్టర్ కె. ఓబిరెడ్డి మా శాఖలో గత మూడు సంవత్సరాలుగా పాఠాలు చెబుతున్నారు 'నవనాథ చరిత్ర' మీద పరిశోధించిన ఓబిరెడ్డి వృద్ధులను సేవించి వారి దగ్గర విద్యను నేర్చుకోవటంలో తపన ఉన్నవారు. లేకపోతే నవనాథుల మీద విషయ సేకరణ చెయ్యలేరు. ఇటీవల జానపద విజ్ఞానం పాఠాలు చెబుతున్నారు. బంజారాల మీద నేను చేసిన పరిశోధన కొంతైనా స్ఫూర్తినిచ్చిందనటానికి ఈ గ్రంథమే నిదర్శనం.

ఈ గ్రంథాన్ని మొత్తం రాశాక నన్ను 'ఉపోద్ఘాతం' రాయమన్నారు. అంచేత గ్రంథంలోని ఏ విషయాలనూ నేను మార్చదలుచుకోలేదు. ఆయన 'Observations' ని అలాగే వుంచాను. నా గుర్తుకి వచ్చిన విషయాల్ని ప్రస్తావించాను.

ఈ గ్రంథంలో 3 అధ్యాయాలున్నాయి. 1. బంజారాల చరిత్ర – సంస్కృతి 2. గిరిజనసమాజం 3. బంజారాల పాటలు – కథలు. ఒక అనుబంధం వుంది. అందులో ఆంధ్రరాష్ట్ర సుగాలీసంఘ సంస్థాపన, అవేర్ సంస్థ కార్యకలాపాలు, అనంతపురం జిల్లా గిరిజన తాండాలు – ఒక సమీక్ష, బంజారాల అభివృద్ధికి కొన్ని సూచనలు ప్రస్తావించబడ్డాయి.

అనంతపురం, చిత్తూరు ప్రాంతాల్లోనూ, కర్ణాటకలోనూ బంజారాలను 'సుగాలీ'లనే పిలుస్తారు. కాబట్టి సుగాలీ సంఘ సంస్థాపనను ప్రస్తావించటంలో ఔచిత్యముంది. ఇలాగే తక్కిన విషయాలూ. శ్రీ రణజిత్ నాయక్ (బొంబాయి), శ్రీరామకృష్ణ (జర్నలిస్ట్ – అనంతపురం), శ్రీ చిన్యా నాయక్ (I.T.I. – అనంతపురం), శ్రీ బి. కె. సత్యం (పుంగనూర్) వీరిని ప్రోత్సహించిన శ్రీ గోపాలరావు నాయక్ (హైదరాబాదు) - వీరందరి ప్రేరణతోనే నేనూ బంజారా పరిశోధన మొదలు పెట్టింది. వీరందరికీ తృప్తిని కల్గించే ఈ గ్రంథాన్ని డాక్టర్ కె. ఓబిరెడ్డి రచించటం చాలా సంతోషకరమైన విషయం.



భవిష్యత్తులో తన పరిశోధన పరిధిని విస్తరింప చేసుకొని డాక్టర్ రెడ్డి తన కృషిని బంజారా సమాజాభివృద్ధి కోసం వినియోగించాలని నేను ఆశిస్తాను.

చివరిగా ఒక మాట. నవనాథుల మీద డాక్టర్ రెడ్డి పరిశోధించారు. బంజారాల్లో మథుర ప్రాంతంలో 'నాథ్' బంజారాలని ఒక తెగ వారున్నారు. అదిలాబాద్ ప్రాంతంలో కూడా కొందరున్నారు. **'Rope trick'** చేసే వారుగా వారికి ప్రసిద్ధి వుంది. ఆటవికులు కాబట్టి నాథ సంప్రదాయంలోకి కొందరైనా ఆకర్షింపబడి వుంటారు. శ్రీ షిర్డి సాయినాథుడు తన గురువు 'బంజారా' అని చెప్పేవాడట. ఈ కథలకు ముడి ఎక్కడో మరి! తిరుమల కొండ మీద 'హతీ రామ్ బావాజీ' మఠం వుంది. అక్కడ బావాజీ అన్న భక్తుడుండే వారు. ఆయన కూడా ఒక బంజారా భక్తుడే. తిరుమలను ముస్లిం తాకిడి నుంచి కాపాడిన వారు బంజారాలే అని కొన్ని కథలు దొరికాయి. డాక్టర్ ఓబిరెడ్డి ప్రయత్నిస్తే ఇంకా దొరుకుతాయి,

డాక్టర్ రెడ్డికి శుభాకాంక్షలు

అనంతపురం　　　　　　　　　　*(సం.) హెచ్.ఎస్. బ్రహ్మానంద*

9–5–1991

# విషయ సూచిక

## మొదటి అధ్యాయం :-



## రెండవ అధ్యాయం :-

### గిరిజన సమాజం :—



## మూడవ అధ్యాయం :-

## అనుబంధం :-





# బంజారా సంస్కృతి - సాహిత్యం



## బంజారాల చరిత్ర - సంస్కృతి

భారతదేశంలో 1981 జనాభా లెక్కల ప్రకారం గిరిజనులు సుమారు 6కోట్ల మందికిపైగా నివసిస్తున్నారు. గిరిజనులలో బంజారాలు అధికశాతం ఉన్నారు. బంజారాలు మన దేశంలో కాశ్మీర దేశం నుండి కర్నాటకలో బళ్లారిజిల్లా వరకు, తూర్పు భాగంలో విశాఖపట్నంజిల్లా మన్యపు అడవి ప్రాంతాలలోను, తూర్పు కనుమల పడమటి భాగంలోను ఎక్కువగా ఉన్నారు. అత్యంత ఆకర్షణీయమైన దుస్తులతోవుండే ఈబంజారాలు ఆంధ్ర ప్రదేశ్‌లో తూర్పుగోదావరి, విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం, జిల్లాలలో తక్కువగా, కర్నూలు కడప, అనంతపురం, నెల్లూరు జిల్లాలలో కొంచెం ఎక్కువగా ఉన్నారు. అంతేగాకుండా మన పొరుగు రాష్ట్రాలైన కర్నాటకలోని మైసూరు అటవీప్రదేశాల్లోను, తమిళనాడులోని కోయం బత్తూరు జిల్లాలో సైతం వీరు కనబడుతున్నారు. వారిని బంజారా, బ్రింజారీ, బొయిపారీ, లంబాడా, లంబాడీ, సుగాలి సుకాలి అని భారత దేశంలోని వివిధప్రాంతాల్లో వేరువేరు పేర్లతో పిలుస్తున్నారు. ప్రత్యేక లిపి లేకపోవడం వల్ల వీరి భాషకు ప్రభుత్వపరంగా గుర్తింపు లేకుండా పోయింది. వీరి భాష, ఆచార వ్యవహారాలు వేరైనందువల్ల వీరు ఇతర ప్రజలకు దూరంగానే ఉంటున్నారు

<u>చరిత్ర</u> :— బంజారా అంటే వ్యాపారస్తుడని అర్థం. బంజారా దానికి సమానమైన బ్రింజారీ, బొయిపారీపదాలు బహుశా సంస్కృత పదమైన వాణిజ్య కారకాన్ అంటే వ్యాపారి నుండి ఉత్పన్నమైనవనీ 'థర్స్టన్' పండితుడు భావించాడు. వీరు పూర్వం బిడారులద్వారా ఆహారపదార్థాలను, యుద్ధ సామాగ్రిని ఒకచోట నుండి మరొక చోటికి రవాణాచేసే వారని, బంజారాలు వర్తకులు కారని, వారు పశువులను, గొర్రెలను మేపి జీవించే వారని తెలుస్తుంది. వారు బరువులను మోసే ఎద్దులపై వస్తువులను వేసికొని

ఒకచోట నుండి మరొక చోటికి చేరవేయడానికి ఇతరులకు సహాయం చేసే వారు. 'బంజారా' అనే పదం 'బళద్'. 'జారా' అనే పదాల నుండి ఏర్పడింది. 'బళద్' అంటే 'ఎద్దు' అని బంజారాల వివరణ. (cp. Sanskrit బలీవర్దము)

పూర్వం వీరు బిడారులను ఎద్దులపై వేసుకొని పోయేవారు. కాబట్టి 'బళద్' 'జారా' అనే పదాలు కాలక్రమంలో 'బంజారా' అయివుండవచ్చును. 'వనచర' అనే పదం పూర్వం వీరు అడవులలో సంచరించే స్వభావాన్ని తెలియజేస్తుంది. కాలగతిలో 'వనచర' అనేపదమే 'బంజారా'గా మారిపోయి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. అదే విధంగా 'లంబాడి' అనేపదం 'లంబాన్' పదం నుండి ఉత్పన్నమై ఉండవచ్చు. 'లంబాన్' అంటే 'పొడవు' అనేది బహుశా వారి పొడవైన ఎద్దుల సముదాయానికి, అనంతమైన వ్యాపారానికి అన్వయించవచ్చును. 'లంబాడి' అనేది సంస్కృత పదమైన 'లవణం' నుంచి కూడా ఉత్పన్నమై ఉండవచ్చు. వారిలో వారు వారి భాషలో 'గోర్‌భాయి' 'గోర్‌మాటి' గోర్‌దాసి అని పిలుచుకుంటారు. 'థర్‌స్టన్' పండితుడు బంజారాలను 'పంజారి' అని పిలుస్తారని చెప్పారు. వారిభాష మరాఠీ, హిందూస్థానీ భాషలను పోలివుంటుంది. కాని నేడు వారు తెలుగు భాషను కూడ మాట్లాడుతున్నారు.

డాక్టర్ గిడుగు వేంకట సీతాపతిగారు "లంబాడీ"లను గూర్చి వ్రాస్తూ "బంజారీ, బ్రింజారీ, సుగాళి, సుకాలి" పదాల ఉత్పత్తిని ఈవిధంగా వివరించారు.1

"బ్రింజారీ, బంజారీ, వంజారీ" అనే పేళ్ళకు సంస్కృత భాషల్లో ఉన్న 'కారి', 'వాణిజ్య', ప్రాకృత భాషలో ఉన్న "వాణిజ్జ ఆరాట" అనే పదాల నుండి వచ్చి ఉండవచ్చునని కొందరి అభిప్రాయం. లంబాడీ, లభానీ, లమానీ మొదలైన పేళ్లు 'లవణ' (= ఉప్పు) శబ్దం నుండి వచ్చినవేమో అని కొందరి అభిప్రాయం. సుగాళి, సుకాళి అనే పేళ్లు సుపారి (= వక్క) అనేపదం నుండి వచ్చి ఉండునని మరికొందరి అభిప్రాయం.

ఈ అభిప్రాయాలను అధారమేమంటే ఈలంబాడీలు వ్యాపారంలో అందులో బిడారి వర్తకం చేస్తూ ఉండేవారు. ఉప్పు, పోకచెక్కలు ఎడ్లపై వేసుకొని ఉత్పన్న స్థలంనుండి కావలసిన చోట్లకు తీసుకొని పోయేవారట".

బంజారా పద ఉత్పత్తిని గూర్చి 'ది మైసూర్ ట్రైబ్స్ & క్యాస్ట్స్' ఈవిధంగా ఉంది.2

"Of the word Banjara, sometimes writer as Brinjara, various meanings are given. Some say that it is another form of the word Vanjara, burners or inhabitants of woods: while others derive it from the Persion word Biranjar meaning a rice - carrier; (Shakespeare's Dictionary) while yet others say that the word means an arrow. The true derivation is Perhaps from the sanskrit word Vanija (trade), which is also responsible for the terms Baniya and Banajiga (meaning trader). It may with equal plausibility be referred to Vanachara (Sanskrit, meaning a wanderer in the Jungle), an account of the nomadic Character of the tribe.

Lambani, sometimes spelt as Lambadi, is said to be another form of the word Lanan, or Labhan, a subdivision of the main caste Banjaras, the other division being Charans, who are alone found in this state, and who claim a some what higher rank. The word Labhan is said by some to be the alternative form of Lavan, meaning salt, the Labhans being salt-carriers. 'But this explaration' says professor Grierson (Linguistic survey of India) "goes against several phonetic rules, and does not account for the forms of the word like Lambani or Lambhani".

"Of the term Sukali, Various meanings, as men of good colour or language, or northern country, are suggested, but they appear to be all of doubtful accuracy. It is said by some that it means arecanu ( being the corrupted form of Supari. It is also referred to as the name of a Lingayat. (Sukali Setti) whose trade of fire wood - selling was very prosperous, and was taken by the Banjaras when they came to southern India. From this, they became known as men of Sukali Settis trade, or Sukalis."

ఆంధ్రప్రదేశ్‌లోని బంజారాలను "లంబాడి, సుగాలి" అని, మహారాష్ట్రలోని బంజారాలను బంజారా,లమని, లంబాడీ, లంమాడీ అని, బీహార్‌లో 'సుగాలి' అని, ఒరిస్సాలో 'బంజారా' అని, గుజరాత్‌లో లంబాడీ సుగాలి అని, రాజస్తాన్‌లో 'దరన్' అని, పశ్చిమబెంగాల్‌లో 'బంజారా', 'గవారియా' అని, ఉత్తరప్రదేశ్‌లో 'బంజారా' అని, మధ్యప్రదేశ్‌లో 'బంజారా' అని, పంజాబ్‌లో 'బంజారా' అని, హర్యానాలో 'బంజారా', "నాట్ శిర్కి బ్రాండ్" అని, ఢిల్లీలో బంజారా, శిర్కి బ్రాండ్ అని, తమిళ నాడులో 'బంజారా, లబాని' అని, కేరళలో 'గవారా' లంబాడీ, సుగాలి అని, త్రిపురలో 'బంజారా, గోర్' అని, కర్నాటకలో 'లంబాడి. సుగాలి, గాన్సియా అని, మైసూరు ప్రాంతంలో "లంబానీ, లబ్‌మాని" అని పిలుస్తారు.[3]

పైనతెల్పిన వాటిని బట్టి చూస్తే "బంజారా, లంబాడీ, లంమాడీ, సుగాలి" అనే పేర్లు ఎక్కువగా అన్ని రాష్ట్రాలలో వ్యవహారంలో ఉన్నట్లు కనబడుతుంది. మొత్తంమీద బంజారాలు ఒకే భాష, ఒకే ఆచార వ్యవహారం, ఒకే రకమైన దుస్తులు కలిగి ఉన్నారు. ఉత్తర భారతదేశంలోని బంజారాలు తమ నామానికి చివర వారి వంశనామాన్ని ఉంచుకుంటారు. మహారాష్ట్ర, దక్షిణ భారతదేశంలోని బంజారాలు తమ నామానికి చివర "నాయక్" అనే బిరుదును వాడుతున్నారు.

మైసూరును పాలించిన మహమ్మదీయుల సైన్యంలో బంజారాలు యుద్ధ వీరులుగా ఉండి ఎక్కువ ధైర్యసాహసాలతో పోరాడి వారికి రాజ్యం సంపాదించి పెట్టడం వల్ల బంజారాలకు 'నాయక్' అనే బిరుదు లభించినట్లు తెలుస్తున్నది. టిప్పుసుల్తాన్ పరిపాలనా కాలంలో బంజారాలు సైనికులుగా, సైనికాధికారులుగా, సర్వసైన్యాధికారులుగా, (కమాండర్–ఇన్–చీఫ్) ఉండేవారు. వీరిలో ప్రతి సైనికుడు సైనికాధికారి లేకుండా తానే సర్వసైన్యాధికారిగా భావించి, వీరోచితంగా, ధైర్య సాహసాలతో పోరాడడం వల్ల వీరు నాయక్ అనే బిరుదను పొంది ఉండవచ్చు. దానికి అనుగుణంగానే నేటికీ మంగళూరులో బ్రాహ్మణ కుటుంబాలలోను, కర్నాటక లోని వాల్మీకి కుటుంబాలలోను, కడప, అనంతపురం జిల్లాల్లోని కొన్ని ముస్లిం కుటుంబాలలోను, నెల్లూరు జిల్లోలోని బెస్తవాళ్లలోను, మహారాష్ట్ర లోని ఒక జాతివాళ్లలోను ఈ 'నాయక్' అనే బిరుదును ఇస్తే వారికి ఒక కొత్త బిరుదును ఇచ్చినట్లు ఉంటుందనీ, వారి గతచరిత్రను మరచిపోయి, వారు ఎవరైనది వారికి తెలియకుండా పోతుందనీ భావించి టిప్పుసుల్తాన్ ఈబిరుదను ఇచ్చినట్లుగా భావించబడుతున్నది. అంతేగాకుండా టిప్పుసుల్తాన్ బంజారాల కోరిక మేరకు రాగిరేకులమీదనాటగు శాసనాలను చెక్కించి ఇచ్చినాడని గిరిజనులలో ఒక ఐతిహ్యముంది. ఈ శాసనం నాకు లభ్యం కాలేదు.*

1. బంజారాలు ఒక దినంలో 12 మందిని హత్య చేసినా వీరి మీద విచారణ లేదట. 12 మందికి మించి ఒక్క హత్య చేసినా కూడా విచారణ జరిగేదట.

2. వీరు పశువులతో ఒకచోట నుంచి మరొక చోటికి సరుకులను రవాణా చేస్తున్నప్పుడు ఆకలి తీర్చుకోవడానికై వీరి పశువులు ఇతరుల పంటలను నష్టపరచినపుడు వీరికి ఏదండన లేదట.

---

* ఈ ఐతిహ్యాన్ని చెప్పినవారు ఇస్లావత్ లక్ష్మానాయక్, అప్పాపుపేట తాండా, (పామిడి మండలం).

3. ఆ కాలంలో ప్రజలు చెరువులోతట్టున నదుల గట్టుల మీద ఎక్కువగా దోసకాయలు, కలింగడకాయలు (కలీంద్రకాయలు) పెంచేవారు. వీరు వాటిని ఆకలితోనో, లేక మరే ఇతర కారణాల వల్లనో కోసు

కుంటే అభ్యంతరం చెప్పకూడదట.

4. ఊళ్ల మీదుగా పోతున్నప్పుడు నీటి ఎద్దడి కలిగితే వీరి పశువులు వేరే వారి ఇంటిదగ్గర వున్న తొట్టిలోని కుడితినీళ్లు తాగినపుడు వారిని మందలించరాదట.

పై విషయాన్ని గూర్చి బేరార్ (Berar) గెజిటీర్‌లో ఈ కింద విధంగా ఉంది.4

"చరనులు (బంజారాలు) షాజహాన్ మంత్రి అయిన ఆసఫ్ ఖాన్ (అని కొన్ని సందర్భాలలో పిలువబడే అసఫ్ జాన్) తో క్రీ. శ. 1630 ప్రాంతంలో గుఱ్ఱపుదండుతో దక్కను దేశానికి వచ్చారు. బంగి, జంగి నాయకులకు లక్షా నలభై వేల దాకా ఎద్దులుండేవి. బుర్‌త్యా (వడత్యా) నాయక్ భగవాన్‌దాసుకు కేవలం యాభై రెండువేల ఎద్దులుండేవి. వారు ఆసఫ్‌జాన్‌ను వెంటబెట్టుకొని దక్కను దేశంపై (బీజాపూర్‌కు వ్యతిరేకంగా) దాడి సందర్భంలో అతనికి కావలసిన తిండి పదార్థాలను మోసుకొని పోయేవారు."

"ఈ ఎద్దులను సరియైన స్థితిలో ఉంచడం ఆసఫ్‌జాన్ ధ్యేయం. ఎద్దులకు మేత, నీరు దొరకని కష్ట పరిస్థితులలో ఆ మంత్రి బంగి, జంగి నాయకులకు ఒక ఉత్తర్వు ఇవ్వడానికి ఉత్సాహ పడినాడు. ఆ ఉత్తర్వు ఒకరాగి రేకుపైన సువర్ణఅక్షరాలతో ఈ విధంగా లిఖించబడింది,

"రంజన్ కా పానీ
చప్పరా ఘాస్
ధిన్ కా తీన్ ఖూన్ మాఫ్
ఔర్ జహాఁన్ అసఫ్ జంకా గోడ్
వహాఁ భంగీ జంగీ కా బైల్"

ఈ శాసనం యొక్క అర్థం బహుశా ఇది కావచ్చు. మీకు నీరు ఎక్కడా దొరకలేదనుకుంటే నా అనుచరుల రంజనుల (కుండల) నుండి తీసుకొనవచ్చును. గడ్డిలేదనుకుంటే నా అనుచరుల గుడిశెల కప్పు పీకి తీసుకొనవచ్చును. మీరు దినానికి మూడు హత్యలు చేస్తే నేను దీనిని కూడా క్షమిస్తాను........"

## ఇతిహాసిక స్మృతులు :—

1. పృథ్వీరాజు అనుచరులు :— ఢిల్లీని పరిపాలించిన పృథ్వీరాజు కాలంలో మహమ్మదీయ ప్రభువైన మహమ్మద్ ఘోరి దండెత్తి వచ్చి పృథ్వీరాజు చౌహాన్‌ను చెరపట్టి అతని కళ్లు తీయించాడు. తన గురువగు 'భట్' ద్వారా పృథ్వీరాజు విలువిద్యా నైపుణ్యాన్ని గూర్చి విన్న ఘోరి అతని శబ్దభేరి నైపుణ్యాన్ని చూడగోరి ఒకసభ ఏర్పాటు చేస్తాడు. అప్పుడు ఆ సభలో కండ్లులేని పృథ్వీరాజు శబ్దాన్ని బట్టి మహమ్మద్ గోరి తలను బాణంతో కొట్టడం జరుగుతుంది. అంత బంజారాల రాజైన పృథ్వీరాజు తమ ప్రభువైన మహమ్మద్ గోరిని చంపుటవల్ల బంజారా జాతినే సర్వ నాశనం చేయాలని మహమ్మదీయులు కంకణం కట్టుకున్నారు. అప్పుడు బంజారాలు తమ ప్రాణ రక్షణార్థం అడవులలోకి పారిపోయారు. తమ శరీరం మీది దుస్తులను చింపి, ఎర్రమట్టిలో పులిమి వాటిని ధరించారు. వారు తమ ఆనవాళ్లు దొరక్కుండా రూపురేఖలను మార్చుకొని అజ్ఞాతంగా అడవులలో, కొండలలో బ్రతకడం ప్రారంభించారు.

2. రాణాప్రతాప్ అనుచరులు :— ఆ తరువాత కాలంలో చిత్తోడ్‌ను (నేటి చిత్తూరు) పాలించిన రాణాప్రతాప్ రాథోడ్ మొగలు చక్రవర్తియైన అక్బర్ పాదుషా చేతిలో ఓడిపోయి కొంత సైన్యంతో అడవుల పాలైనాడు. ఆ సమయంలో మాతృభూమిని రక్షించుకొనే వరకు పూరిగుడిసెల్లో నివసిస్తూ, చిరుచాప మీద పవళిస్తూ, మట్టి పాత్రలలో భోజనాదులు చేస్తామని రాణాప్రతాప్ రాథోడ్ శపథం చేసిన కారణంగా ఈనాటి వరకు బంజారాలు అదే విధంగా తమ జీవన యాత్రను కొనసాగిస్తున్నారని కొందరు అభిప్రాయ

పడుతున్నారు. భారతదేశం పరాయి ప్రభువుల బారినుండి స్వాతంత్ర్యాన్ని పొందిన తరువాత అదే బంజారా రాథోడ్ వంశానికి చెందిన శ్రీ వి.పి. నాయక్ మహారాష్ట్ర ముఖ్యమంత్రి అయి, చాలాకాలం ఆ పదవిలో ఉన్నారు.

ఏ విషయాన్నైనా త్వరగా అవగాహన చేసుకోగలిగిన దృఢకాయులైన బంజారాలు ఒక పెద్ద సంఖ్యలో ఆంధ్రప్రదేశ్ అంతటా విస్తరించి నారు. వీరు గిరిజనులు, గిరిజనేతరుల మధ్యలో నివసిస్తున్నారు. వారు తమ సాంస్కృతిక విలక్షణతను నేటికీ పూర్తిగా విడనాడటం లేదు. సామాన్యంగా వారు తమ నాయకుల పేర్లతో పిలువబడుతూ, ప్రత్యేకమైన నివాసస్థలాలలో అంటే ఊరికి దూరంగా ఉన్న తాండాలలో నివసిస్తున్నారు వారు మొదట రాజస్థాన్‌లోని మార్వాన్ ప్రాంతానికి చెందినవారని, బంజారాలు భాషాపరమైన, సాంస్కృతిక పరమైన సంబంధాలు రాజస్థాన్‌లో లభ్యమయ్యే ఇతర భాషాగ్రంథాలవల్ల విదితమవుతాయి.

## సంస్కృతి :—

1. దుస్తులు, ఆభరణాలు :— పొడవైన దేహంతో కాంతి వంతమైన ముఖ వర్చస్సుతో బంజారాలు ఒక ధృఢమైన జాతి. మగవారు మధ్యరకమైన ఎత్తుతో బలంగా ఉంటారు. పంచ, చిన్నచొక్కా, తలపాగా మగవారి సంప్రదాయమైన దుస్తులు. ఎర్రని ముతకబట్టలతో తయారుచేసిన ఎక్కువగా కుట్టుపని తనం ఉన్న, నడుము దగ్గర చాలా ఎక్కువ మడతలు పెట్టి కట్టబడిన లంగాలను ఆడవారు ధరిస్తారు. వారు 'ఛాంటియా' అను దానిని తలనుండి వెనుకప్రక్క వీపుపై వ్రేలాడే వరకు వేసుకొంటారు. గవ్వలతోను, పూసలతోను గాజు ముక్కలతోను, తయారుచేసిన "టుకరీ" అనబడే మేలి ముసుగును చీరకుబదులుగా లంబాడీ ఆడవారు వేసికొంటారు. 'కాంచళి' అనే రవికను ఆడవారు ధరిస్తారు. పెండ్లికాని ఆడపిల్లలు కాలికి 'ఘాంఘ్రియా' అనబడే ఇత్తడి కాలి మువ్వలు ధరిస్తారు. వారు నడిచేటప్పుడు అవి జింగ్ లింగ్ శబ్దాన్నిస్తాయి. ఆ మువ్వలను వారు పెండ్లికాబోయే సమయంలో

తీసివేస్తారు. పెండ్లికాని అమ్మాయిలు జడలకు "టోప్లి"ని, పెండ్లి అయిన తరువాత 'టోప్లి'కి పైన 'ఘుగరీ'ని ధరిస్తారు. ఘుగరీని మంగళ సూత్రాలకు బదులుగా వాడుతారు. (వివారించగా ఘుగరీ హిందువుల మంగళ సూత్రాలకు బదులని లంబాడీలు చెప్పారు.) లంబాడీ ఆడవారు వెండితో తయారుచేసిన "ఆడ్‌కాంట్" గొలుసులను ప్రక్క చెంపలకు, తల వెంట్రుకలకు ముడిపెట్టుకొంటారు. వాటిని చెవిపైభాగం నుండి క్రిందివరకు వ్రేలాడదీసుకొంటారు. పెండ్లి అయిన ఆడవారు దంతాలతో చేసిన "ఓలన్" అనే గాజులను మోచేతి వరకు ధరిసారు. వారు 'వాంకిడి', 'కన్నె' అనే కడియాలు, 'చక్టి', వించువా', 'అంగుట్లా' అనే మెట్టెలు కాలివ్రేళ్లకు తొడుగు కొంటారు. లంబాడీ స్త్రీ విధవైతే ఘుగరీ, అంగుట్లా, వాంకిడి తీసివేస్తారు.

<u>2. వివాహ పద్ధతులు :—</u> లంబాడీలు ఇతర కులస్థులతో కలసి సహపంక్తి భోజనానికి సంబంధించినంత వరకూ వారు హరిజనులు, ముస్లింలు, తదితర కులస్థుల ఇళ్లలో భోంచేయరు. కాని వారు బ్రాహ్మణులు, కోమట్లు. కాపు కులస్థుల ఇళ్లలో భోంచేస్తారు.

లంబాడీలు స్వజాతిలో మాత్రమే వివాహం చేసుకొంటారు. వారు ఇతర కులాలనుండి పెండ్లి కుమారుని గాని, పెండ్లి కూతురునుగాని స్వీకరించడానికి అంగీకరించరు. లంబాడీ పురుషుడు తనజీవిత భాగస్వామిని (భార్యను) ఎన్నుకొనేటప్పుడు పరస్పరం బాగా చర్చించుకొన్న తరువాత వివాహం చేసుకొంటాడు. కొన్ని సందర్భాలలో అత్త మామల ఇంటి దగ్గర సేవచేసి వారిని మెప్పించి పెండ్లి చేసుకొనే పద్ధతి కూడా కలదు. లంబాడీలలో స్త్రీ పురుషులకు అభిప్రాయ భేదాలు వచ్చినపుడు విడాకులు తీసుకొనే పద్ధతి ఉంది. విధవా పునర్వివాహాలను లంబాడీలు ప్రోత్సహిస్తారు. ఒకవేళ భార్యచనిపోతే తన మరదలును భార్య చెల్లెలిని) పెండ్లి చేసుకొనే పద్ధతిని కూడ లంబాడీలు అనుమతిస్తారు.

ఏది ఏమైనను లంబాడీలు "పెండ్లిండ్లు సులువుగా చేసుకొందురు. సన్నికల్లు చుట్టును ఏడుసార్లు తిరగడం, వధూవరులు పసుపుత్రాళ్లు ఒకరినొకరు వేసుకొని ఏడుముళ్లు బిగించడం ముఖ్యం. బ్రాహ్మణ పురోహితుని

పెట్టుకొందురుగాని అతడు చేయవలసిన పని అంతా "శోభన శోభన" అనడం మాత్రమే. చనిపోయిన వారిలో పెండ్లి అయిన వారికి దహనమున్ను కాని వారికి పాతి పెట్టడమున్ను ఆచారము".5

3. ఆహారం, మత్తుపానీయాలు :— బంజారాలలో "బడావత్" గోత్రానికి చెందిన వారుతప్ప మిగిలిన వారందరూ తప్పనిసరిగా మాంసాహారులు. బడావత్ గోత్రం వాళ్లు కఠోర శాకాహారులు. బంజారాలు ఇప్పసారాయి, కల్లు మొదలగు మత్తు పానీయాలకు, ధూమపానానికి అలవాటు పడ్డారు. ముఖ్యంగా వివాహ సమయాల్లోను, చావు సందర్భాల్లోను చాలా ఎక్కువగా డబ్బును ఖర్చుపెట్టి మత్తుపానీయాలను సేవిస్తారు. ఈ విధంగా వారు వేలకువేలు డబ్బును ఖర్చుపెట్టడంవల్ల అప్పులపాలై పోవటం, అనారోగ్యానికి గురికావడం కద్దు.

4. సమాజనిర్మాణం :— బంజారా కులంలో ప్రధానంగా 1. రాటోడ్ భుక్యా 2. పమార్ 3. చౌహాణ్ 4. వడత్యా అనే నాలుగు ముఖ్యజాతులు, వాటి ఉపజాతులూ ఉన్నాయి.

బంజారాల జాతులలో లభ్యమైన కొన్ని ఉపజాతుల పేర్లు ఈకింద పేర్కొనబడ్డాయి.6

*1. రాటోడ్ భుక్యా :—* ఈ జాతిలో ఏడు ముఖ్య ఉపజాతులుగలవు. 1. ధుంగావత్ 2. కింనావత్ 3. రామావత్ 4. డేగావత్ 5. కేతావత్ 6. కరంతోత్ 7. నేనావత్

పై ఏడు ఉపజాతులు మరల జంగి (కోల), బంగి అనే రెండు తెగలుగా విభజించబడింది.

*1. జంగి :—* 1. ఖాత్రోత్ 2. రత్లా 3. మాదేర్చ 4. రామన్య 5. వేద్యోత్ 6. జలపోత్ 7. డార్వన్ 8. సుధారత్ 9. ఫదాన్ 10. మేష్లాత్ 11. డల్పాన్ 12. జటరోత్

**2. జంగి :–** 1. రజావత్ 2. కుంభావత్ 3. మేరాజోత్ 4. డేగావత్ 5. కిమావత్ 6. దుంగావత్ 7. రామావత్ 8. కేతావత్ 9. కోడావత్ 10. కరంతోత్ 11. నేనావత్ 12. మేగావత్ 13. పిటావత్

**2. పమార్ :—** 1. జరబ్లా 2. విస్లావతు 3. అంగోతు 4. వాంకోడోతు 5. విం(దావతు 6. లూన్సావతు 7. లోకావతు 8. గోరామో 9. అయివాతు 10. వైవాతు 11. బాని 12. తరాబాని

**3. చౌహాణ్ (మూఢ్) :—** 1. మూఢ్ 2. శబావత్ 3. కేలూత్ 4. కొర్యా 5. పాల్త్యా 6. లావడ్యా

**4 వడత్యా :—** 1. బడావత్ 2. బోడా 3. గోగాలోత్ 4. డరావత్ 5. అజ్మేర 6. తేజా 7. మేరావత్ 8. మాలోత్ 9. లకావతు 10. లూనావత్ 11. బారోత్ 12. హలా 13. కునాసి

తంబూరిన్ అనే ఉపజాతులో 6 తెగలున్నాయి.
1. రత్నావత్ 2. భట్ 3. సేరావత్ 4. దావత్ 5. భాజిజట్ 6. రుదావత్

అంతేగాకుండా బాణోత్ అనే జాతిలో 16 ఉపజాతులున్నాయి.
1. దానావత్ 2. రూపావత్ 3. సబ్దాసోతు 4. లావోరీ 5. ధీరావత్ 6. కుంతావత్ 7. మూడావత్ 8. అదోత్ 9. కానావత్ 10. భోజావత్ 11. పానావత్ 12. కర్నాపత్ 13. జాటోత్ 14. ధర్మసోత్ 15. బందావత్ 16. బానోత్

ప్రతి ఉపజాతికి ఒక్కొక్క రకమైన వివాహపు కట్టుబాట్లు ఉన్నాయి. ఒక ఉపజాతి సభ్యుడు మరొకజాతిలోని ఉపజాతిలో వివాహం చేసుకోవచ్చును. ఉదాహరణకు రాటోడ్ భుక్యా జాతిలోని ఉపజాతి సభ్యుడు పమార్ లేక చౌహాణ్ లేక బాణోత్ లేక వడత్యా జాతిలోని ఉపజాతిలో వివాహం చేసుకోవచ్చును. కారణమేమంటే సొంత ఉపజాతుల వారందరు ఒకతల్లి బిడ్డలవలె అన్నా చెల్లెలు వరుసలవుతారని వారు భావిస్తారు.

గోత్రం అనేది తండ్రివల్ల సంక్రమిస్తుంది. గోత్రనామాన్ని వ్యక్తి పేరుకు ముందు భాగంలో ఉపయోగిస్తారు. కన్నె తన సంతతి గోత్రాన్ని పెళ్లయిన తరువాత పోగొట్టుకొని తనభర్త యొక్క గోత్రాన్ని అనుసరిస్తుంది. బడావతు గోత్ర సభ్యులు కఠినమైన శాకాహారులైనందున వారు మెడచుట్టు పవిత్రమైన దారాన్ని చుట్టుకొంటారు. బంజారాలలో వారు అన్ని గోత్రాల వారికంటే శ్రేష్ఠమైన వారుగా పరిగణించబడతారు.

ఈ ఐదుజాతులలోని ఉపజాతులేగాక యింకా అనేక ఉపజాతు లున్నాయి. "డప్పన్"లు బంజారాల సంప్రదాయ సిద్ధమైన గాయకులు. సేవకులు, డప్పన్‌లు ముఖ్యంగా బంజారాలు వివిధ సమయాలలో వారికిచ్చే ఇనాములపై ఆధాపడతారు. అంతేగాకుండా వారు కూలిపని చేసుకొని జీవిస్తారు. డప్పన్‌లలో 1. భాట్ 2. ఢాడి 3. ఢాల్యా అనే తెగల వాళ్ళున్నారు.

భాట్. ఢాడిలు కుటుంబ చరిత్ర మీద 'జంగె' 'కంజ్రి' అనబడే వాద్యాలు వాయిస్తూ వివాహపు వేడుకలలో పాటలు పాడతారు. ఢాల్యా లేక డప్‌డియాలు 'డప్పులు' వాయిస్తారు. బంజారాలకు సంప్రదాయ సిద్ధ మైన 'నాది' అనబడే మంగలి వారున్నారు. ఢాడీలు అంటే భట్రాజులు. బంజారాల పుట్టు పూర్వోత్తరాలు, వంశ చరిత్రలు, సాంస్కృతిక సంబంధ మైన యితర రహస్యాలు వీరికి తెలుస్తాయి. ఢాల్యాలు తప్పెట కొడతారు. 'భవారా' అనేవారు ఆడవారికి సంబంధించిన దుస్తులను సీసంతో కరిగించిన ఆభరణాలను తయారుచేస్తారు. వీరేగాక వెండి బంగారు ఆభరణాలు తయారుచేసే 'పవార్' బంజారాలనే అంతర్విభజన కూడా కలదు. ఈ సముదాయాలన్నీ బంజారాలలోని ఉప తెగలు. ఈ ఉప తెగలన్నీ బంజారాల గోత్ర నిర్మాణాన్ని అనుసరిస్తాయి. కాని వారిలో వారికి అంతర్వివాహాలు పూర్తిగా నిషేధం. ఈ ఉపతెగలన్నీ ప్రధాన బంజారాల కంటే సాంఘిక హోదాలో తక్కువగా పరిగణించబడతాయి.

బంజారా జాతిలో సభ్యత్వాన్ని పొందడానికి కేవలం పుట్టుక అన్నది ఒక్కటే లక్ష్యంకాదు. ఇతర కులస్థులు కూడా ఆజాతిలో సభ్యులుగా

చేర్చుకోబడతారు. ఇతరకులసభ్యులను తమ జాతిలో చేర్చుకోబడే పద్ధతిని 'జాంగడ్ అని పిలుస్తారు. పిల్లలు కలగని తల్లిదండ్రులు వారి వంశాభివృద్ధికై ఇతర కులాల పిల్లలను దత్తతకు తీసుకొని తమ పిల్లల లాగే పెంచి పెద్దచేసి పెండ్లిండ్లు చేస్తారు. కాని ఇక్కడ పెండ్లి చేసేటప్పుడు బంజారాలు కాని పిల్లలను సాకిన వారితోనే బంధుత్వాన్ని కలుపుకొంటారు. అయితే బంజారాలు మాత్రం తమ పిల్లలను వారికిచ్చి పెండ్లిచేయరు. ఈ విధంగా ఏడుతరాలు గడసిన తర్వాత బంజారాలు వారిని శాస్త్రోకంగా తమలో కలుపుకొంటారు. ఆ తర్వాత వారు బంజారాలలో కలసిపోతారు.

*సాంఘికాచారాలు :—*

ప్రతి తాండాలో లంబాడీలకు ఆర్థిక, సామాజిక కారణాలవల్ల ఉత్పన్నమయ్యే తగాదాలు తీర్చుకొనడానికి ఒక సంప్రదాయక కార్య నిర్వాహక సభ ఉంటుంది. ఈ సభలో ఒక పెద్దమనిషి (నాయక్), ఒక సలహాదారుడు (కార్‌జారి , ఒక వార్తాహరుడు (డప్పన్) ఉంటారు. వీరు కాకుండా "డావో" అనే ఒకకార్య నిర్వాహక సభ్యుడు కూడా ఉంటాడు. ఈ అన్ని పదవులూ వంశపారం పర్యంగా సంక్రమించేవి. ఒకవేళ నాయక్ లేనప్పుడు కార్‌జారి సభకు అధ్యక్షత వహిసాడు. నాయక్ అజ్ఞానుసారం వార్తాహరుడైన 'డప్పన్' తాండాలోని సభ్యులందరికి వార్త లందజేస్తాడు. ఒకవేళ నాయక్‌కి తనపదవికి వారసుడు లేకపోతే ఆ తాండాలో అన్నిరకాల యోగ్యతగలవాణ్ణి నాయకునిగా ఎన్నుకొంటారు. వేడుకలప్పుడు 'నాయక్' కార్‌జారి, డప్పన్‌లు ప్రత్యక్షంగా ఉండటం చాలా అవసరం. బంజారాల సంప్రదాయక కావ్యనిర్వాహక సభను 'నాయకేర్ ఘర్' అని పిలుస్తారు. ఎప్పుడైనా తాండాలో వివాదం జరిగితే నాయక్ సభాధ్యక్షత వహించి వివాదాన్ని పూర్తిగా చర్చించి, విచారించి తప్పు చేసినవానికి జరిమానా విధిస్తాడు. ఈకార్య నిర్వాహకసభ సమావేశాలను 'మాలావో' అని అంటారు. తప్పుచేసిన వానిని 151 రూపాయలు కట్టమంటారు. జరిమానా సొమ్ములో 5 లేక 10 రూపాయలు తనవద్ద ఉంచుకొంటాడు. కార్‌జారికి 2 లేక 3 రూపాయలు, డప్పన్‌కు 5 రూపాయలు బహుమానమిసారట. మిగిలిన సొమ్మును అన్యాయం జరిగిన వారికిస్తారు.

## జీవిత చక్ర ఆచారాలు :—

1. శిశుజననం :— లంబాడీ జాతిలో శిశుజననమప్పుడు ఒక ఆడముదుసలి మంత్రసానిగా వ్యవహరిస్తుంది. ఈమె బొడ్డును కత్తిరించి మాయను ఇంటి ముందర గోతిలో పాతిపెడుతుంది. ప్రసవించిన స్త్రీని ఒకనెలవరకు వేరుగా ఉంచుతారు. వారు తొమ్మిదవ దినం విందు (పురుడు) పాటిస్తారు. ప్రసవించిననాడు స్త్రీకి పుట్టిన శిశువుకు పవిత్ర స్నానం చేయిస్తారు. శిశువుకు దోషం పోవడానికి ఈ వేడుక విందును ఆచరిస్తారు. శిశు జననం తరువాత తొమ్మిదవ దినం నాడు నామకరణం చేస్తారు. లంబాడీ జాతిలోని పెద్ద మనుష్యులు పుట్టిన శిశువుకు పేరు పెడతారు.

శిశువుకు రెండవ సంవత్సరంలో పుట్టువెంట్రుకలు తీసే వేడుకను ఆచరిస్తారు. ఈ వెంట్రుకలు వారి దేవుడు అయిన బాలాజీ లేక నాందేడ్ గురువు పేరుమీదుగా అర్పిస్తారు. ఆర్థిక స్తోమత లేక తిరుపతిగాని, మహారాష్ట్రలోని నాందేడ్‌కి గాని పోలేని కుటుంబాలు వారి ఇంటి దగ్గరే మంగలిని పిలిపించి పుట్టువెంట్రుకలు తీసే వేడుకను జరిపిస్తారు. కొద్దిగా పిలకజుట్టును ఉంచి మిగతా వెంట్రుకలన్నింటిని తీయిస్తారు. కొన్నిదినాల తరువాత అదే మంగలితో పిలకజుట్టును కూడా తీయిస్తారు.

2. వివాహం, కుటుంబం :— లంబాడీలలో రజస్వల అయిన ఆడ పిల్లలను పదిరోజులు వేరుగా ఉంచుతారు ఈకాలంలో ప్రత్యేక వేడుకలేమీ చేయరు. స్నానంచేయించిన తరువాత మిగతా ఆడవారితో కలిసితిరిగేందుకు అనుమతిస్తారు. పరస్పర అవగాహనలతో చేసుకొనే పెళ్లి ఒక్కటే అనుమతించబడ్డ వివాహపద్ధతి. కొన్నిసార్లు పెండ్లికూతురు తల్లిదండ్రులకు పెండ్లికొడుకు సేవచేసి పెళ్లిచేసుకొనే పద్ధతి కూడ వాడుకలో ఉంది.

పెండ్లిలో ప్రధానమైన వేడుక అయిన నిశ్చితార్థం తరువాత పెండ్లికుమారుడు పెండ్లికూతురింటికి వెళ్లి పెండ్లి జరిగేంతవరకు అక్కడ ఉంటాడు. ముఖ్యంగా ఇది అబ్బాయి నడవడిక, స్వభావం తెలుసుకోవడానికి ఉపయోగపడేకాలం. అతడు తన మామగారింట్లో తన శరీరాన్ని తెల్లని బట్టతో కప్పుకొంటాడు. అతడు తన మామగారింటికొచ్చే అతిథు

లందరిని గౌరవించాలి. అతను పెద్దలముందర మంచంపైన కూర్చుండ రాదు. అతడు స్వయంగా హుక్కా (పొగాకు చుట్టలు) తయారుచేసి పెద్ద మనుష్యులకు బహుకరించాలి. పెండ్లికొడుకుకు అతనికిష్టమైన పదార్థాలు తినటానికిస్తారు. అతడు తప్పనిసరిగా తనబావమరిదితో కలిసి ఒకే కంచంలో భోంచేయాలి. ఒకవేళ భార్యాభర్తలలో ఏఒక్కరి నడవడిక అయినా బాగలేక పోతే పెద్దవాళ్లు కూర్చొని ఆ జంటను రద్దుచేస్తారు. అబ్బాయి, అమ్మాయి ఎవరింటికి వారు వెళ్లిపోతారు. పెండ్లికొడుకు మామగారింట్లో పెండ్లికాక ముందే 'వారికి సేవచేసే ఆచారాన్ని బంజారా భాషలో "భంగ్" అని పిలుస్తారు.

సాధారణంగా పెండ్లికి ముందురోజు పెండ్లి కుమారుడు పెండ్లి కూతురింటికి వెళ్తాడు. లంబాడీలలో ఓలి 400 రూపాయలు నుండి 1000 రూపాయలు వరకూ, 4 ఆవులు, 2 మేకలు, 150 నుండి 200 వరకు కొబ్బరి మొక్కలు ఉంటుంది. వీరు వివాహం జరిపించడానికి బ్రాహ్మణ పురోహితుని ఆహ్వానిస్తారు. పెండ్లి కూతురికి దంతపు గాజులు, కాలి ఆభరణాలు. (మట్టెలు, గొలుసులు) పెండ్లిదినం ధరింపజేస్తారు.

సాంప్రదాయకంగా పెళ్లి జంటలను ఎన్నికచేయడానికి, నివాసం నిర్ణయించడానికి, ఆస్తులను పరిరక్షించడానికి, నీతిని గమనించడానికి ఉమ్మడి కుటుంబం ముఖ్యపాత్ర వహిస్తుంది. ఉమ్మడి కుటుంబాలు వెనుక తరాలలో ఎక్కువగా ఉండేవి. కాని నేడు నెమ్మదిగా ఏక సభ్య కుటుంబా లుగా విడిపోతున్నవి. సామాన్యంగా బంజారాలు మిగతాజాతులు నివసించే గ్రామానికి కొద్దిదూరంలో ఉండే తాండాలలో, విడివిడిగా ఉంటున్న గుడిసెలలో నివసిస్తున్నారు. వారి ఇళ్లు బోదగడ్డితో కప్పబడిన చతురస్రా కారం, దీర్ఘ చతురస్రాకారంగా ఉంటాయి. ప్రక్కభాగాలు వెదురు కట్టెలతో కప్పబడి ఉంటాయి. పెండ్లి సందర్భంలో 'గరుభావా' పేరుమీద ఒక రూపాయను ముడుపుగా తీసి ప్రక్కన పెడతారు.

3. చావు సమయంలో తంతు :— చనిపోయిన వారిని ప్రత్యేక దహన స్థలంలో దహనం చేస్తారు. మృత కళేబరాన్ని తీసుకొనిపోవడానికి కర్రతో తయారుచేసిన ఆకారాన్ని 'ఖాట్' అని పిలుస్తారు. అప్పుడు చనిపోయిన

వారి పెద్దకుమారుడు పవిత్రమైన అగ్నిని దహనస్థలానికి చితికి నిప్పు అంటించేందుకు తీసుకొని వెళ్లతాడు, దహన సంస్కారం తరువాత సభ్యు లందరు స్నానంచేసి ఇంటిలోకి పోతారు. మూడు లేక ఐదవరోజు అంటే మంగళవారం కాని లేక శుక్రవారంనాడు కాని అంత్యక్రియలు జరిపిస్తారు. వారు ఒక జంతువును బలిచేసి, మాంసాహారాన్ని చనిపోయిన వారి ఆత్మకు సమర్పిస్తారు. తొమ్మిదవ దినం దగ్గరి బంధువులకు తీపి పదార్థాలతో విందు చేస్తారు. ఒకవేళ భర్తతోపాటు భార్య సహగమనం చేస్తే అలాంటి వారిని ఇప్పటికీ పూజిస్తారు. సహగమనం చేసిన ఆమె పేరుమీద ఆమెకున్న చిన్నపిల్లలకు పుట్టినవె డుకలు తీయిస్తారు.

4. దేవతలు, పండగలు :— ప్రపంచమంతా వివిధరకాలైన శక్తులతో రక్షించబడుతుందని బంజారాలు నమ్ముతారు. ఈ ఉపకార బుద్ధిగల శక్తులను వరుసక్రమంగా బలులతో, ప్రార్థనలతో శాంతింపజేస్తారు. ఈ ప్రార్థనల రూపమే సీతలా, తొలజా, భవాని (కంకాళి), మరియామ పంక గలు. బంజారాలు ఉపకార బుద్ధిగల మగదేవుళ్లు అయిన బాలాజీ, సేవాల్ భాయలను, విష్ణు, రాములను కూడ పూజిస్తారు. మరియామ తమ అడవాళ్లను, పిల్లలను రక్షిస్తుందని, భూములను, అడవాళ్లను ఫలవంతంగా చేస్తుందని, సేవాల్ భాయ, సీతలా తమపశువులను రక్షిస్తాయని నమ్ముతారు. వారు ప్రత్యేకంగా 'మత్రాల్' అనే దేవతను తమ పశువుల సంక్షేమం కొరకు మంగళవారం పూజిస్తారు. భవాని (కంకాళి), మహంకాళి దేవతలను దసరాపండగనాడు పూజిస్తారు. వారు ఈ దేవతకు మేకపోతులను పొట్టేలను, కోళ్లను, బలియిస్తారు. వారు ఫలదాయినులైన రూపాసతి, లక్ష్మిసతి, హునసతి, కేసలసతి, సీసతి. పోమ్లి సతులను కూడ పూజిస్తారు. వారు శక్తిపూజలు ఎక్కువగా చేస్తారు. మరియామ, కనకదుర్గ. మంత్రాలమ్మ మారెమ్మ, దండమారెమ్మ. తొలజా, బంజారామట్, హతిరుంబావామట్‌లను పూజిస్తారు. వీరు క్షత్రియులు కనుక క్షత్రియ ధర్మం నశింపకుండ ఉండ టానికై ఈనాటికి వీరు ఆదిశక్తిని పూజించి జంతు బలియిస్తున్నారు.

లంబాడీలు తీజ్. సీతలా, తొలజాభవాని, హోలీ అనే ముఖ్య సంప్రదాయకమైన పండగలను, తప్పనిసరిగా చేసుకొంటారు. అంతేగాకుండా

వీరు హిందువుల పండగలైన ఉగాది, రాఖీ, నాగులచవితి, దసరా, దీపావళి, సంక్రాంతి, శివరాత్రి పండగలను కూడ ఈమధ్యనే చేసుకొంటున్నారు. ప్రస్తుతం లంబాడీల కొన్ని ముఖ్య పండగలను గూర్చి తెలుసుకుందాం.

1. తీజ్ :— మంచి చలికాలమైన శ్రావణమాసంలో తొలివర్షం బాగా వేడెక్కిన భూమిని తడుపు సమయంలో బంజారాలు ఫలవంతమైన తీజ్ పండగను చేసుకొంటారు. ఈ పండగను తొమ్మిది దినాలు వివిధ రకాలైన ఆచారాలతో చేస్తారు. పలవంతమైన ఈ పండగను ముఖ్యంగా పెండ్లికాని ఆడవారు (కన్యలు) చేసుకొంటారు. బంజారాలు కన్యలను పుట్టుకతో అపవిత్రులుగా పరిగణిస్తారు. పండగ దినాలలో మరియామ, సేవాల్ భాయలకు శాంతిచేస్తారు. పెండ్లికాని ఆడవారు కొత్త బట్టలు తీసుకొచ్చి ఒక బుట్టలో పెట్టి అందులో బంగారాన్ని ఉంచుతారు. అబ్బాయిలు గోధుమలు గాని, జొన్నలు గాని అందులో ఉంచుతారు. ఈ బుట్టలను ఒక ఎత్తయిన ప్రదేశంలో పెడతారు. కన్యలు ఆ బుట్టలను తొమ్మిది దినాలు కాపలా కాస్తారు. ప్రతిరోజు వారు సాంప్రదాయక నృత్యాన్ని చేస్తారు. తొమ్మిదవ దినం ఆబుట్టలను కిందికి దించి ఆ తాండాలోని బంజారాలంతా వాటిని పూజిస్తారు. ఒకవేళ ఆ తొమ్మిది బుట్టలలో ఏ బుట్టలోనైనా గింజలు సరిగా మొలకెత్తకపోతే ఆ బుట్ట ఉంచిన కుటుంబం వారికి ఆ ఋతువులలో మంచి పంట పండదని వారి నమ్మకం. అంతేగాకుండ వారు ఈ సందర్భంలో దుష్టశక్తులను శాంతింప చేయడానికి ప్రత్యేకమైన ఆచారకర్మలు చేయవలసి వుంటుంది.

2. సీతలా :— ఆషాడమాసంలో 'సీతలా' అనే ముఖ్యమైన వార్షిక పర్వంగా బంజారాలు చేసుకొంటారు. ఈ పండగను తీజ్ పండగవలె కాకుండా అందరూ ఆచారకర్మలు చేసుకొనే అవకాశం ఉంటుంది. సీతలా పండుగదినాలలో బంజారాలు అక్కాచెల్లెళ్లు, అపకార శక్తిగల సీతలా, తొలజా. హింగ్లీ, మసూరి, ధోలాంగేర్, అంబ, మరియామలను శాంతింప చేసారు. సీతలా అందరికంటె పెద్దది కాబట్టి మొదట ఆదేవతను శాంతింప

చేస్తారు. ఈ ఏడుగురు అక్కాచెల్లెళనేగా క"లుంకాడియా" అనే మగశక్తిని కూడా వారు శాంతింపజేస్తారు. ఈపండగను తాండా పొలిమేర ప్రాంతంలో జరుపుతారు. తాండాలోని నాయకుడు ఆ తాండాలోని ధైర్యస్థులైన మగ వారిని తోడుగాతీసుకొనిపోయి తాండా పొలిమేరలో ఒక స్థలాన్ని పండగ చేసుకోవడానికి నిర్ణయిస్తాడు, ఆ సందర్భంలో నాయక్ పూజారిగా వ్యవహరిస్తాడు. సీతలా పండగదినంనాడు ఆయన ఉపవాసముంటాడు. ఒక జంతువును బలియిచ్చి దాని రక్తాన్ని ఏడుశక్తుల ముందర చల్లుతారు. ఆ తర్వాత అక్కడ ఉన్న జనం వారివారి స్తోమతనుబట్టి మేకపోతులను, కోళ్లను బలియిస్తారు. సీతలా, ఆమె అక్కచెల్లెళను మహాచి దేవతలుగా పరిగణించి, వారిని శాంతింపజేయడానికి, తమ పిల్లలను పశువులను వివిధ విధాలైన జబ్బుల బారినుండి కాపాడుకొనేందుకు పైవిధమైన కర్మలను చేస్తారు.

*3. తొలజా భవాని :—* తొలజాభవాని పండగను కార్తీకమాసంలో (నవంబరు - డిశెంబరు నెలల్లో) ఏదైనా ఒక మంగళవారంనాడు చేసుకొంటారు. సీతలా, తీజ్ పండగలవలె కాక తొలజా భవాని పండగను బంజారాలలోని ప్రతిఒక్క కుటుంబం వారు చేసుకొంటారు.

*4. హోలీ పండగ :—* ఫాల్గుణ మాసంలో పూర్ణిమనాడు హోలీ పండగను బంజారాలు చేసుకొంటారు. దీన్ని "కాముని పున్నమి" అని కూడా పిలుస్తారు. ఈ పండగను వీరు చాలా ఉత్సాహంగా, సంబరంగా జరుపుకుంటారు. ఈ పండగ సందర్భంలో వీరు ప్రతిమనిషిని వేధించి, బాధించి డబ్బులు అడుక్కుంటారు. పూర్ణిమనాడు కామకారకుడైన కాముడ్ని (మధనున్ని) దహనంచేసి మరునాడు హూలీ పేరిట వసంతాలు చల్లుకుంటూ ఉత్సాహానికి మారు పేరుగా వేడుకలు జరుపుకుంటారు. ఆ దినం బంజారా యువతీయువకులు వివిధవిధాల రంగుల కలయికతో కొత్తగా గమ్మత్తుగా కనిపిస్తారు.

*5. మతం :—* సాధారణంగా కొండలు, అడవి ప్రాంతాలలో నివసించే గిరిజనులకు మతమనేది లేదు. వారికున్నదంతా సాంప్రదాయికమైన

సంస్కృతి మాత్రమే. బంజారాజాతి ఒక మతానికి సంబంధించిందికాదు. ఇందులో అన్నిమతాలు, వృత్తులు, కులాలకు సంబంధించిన హిందూ బంజారాలు, సిక్కు బంజారాలు, ముస్లిం బంజారాలు, క్రైస్తవ బంజారా లున్నారు.

బంజారాలలో వివిధ వృత్తుల, కులాల వారు ఉన్నారు. ఉదా-హరణకు బంజారా సొమ్ములు చేసేవారిని "పవార్-భవారా" అని, బట్టల అద్దకం చేసే వారిని "రంగారా" అని, డప్పులు కొట్టేవారిని 'ఢాల్యా' అని, బాపలల్లే వారిని "శిర్కి బంజారా" అని బంజారా, వంశావళి, గాథలు కవిత్వంలో చెప్పే వారిని "ఢాడి, భాట్" అని అంటారు.

బంజారాలు పశుజాతిని వృద్ధిచేయడంలో మంచి నిపుణులు. వారు పాలు, పాలతో తయారుచేసిన పదార్థాల (పెరుగు, వెన్న, జున్ను, నేయి) మీద ఆధారపడతారు. నేడు భూమిని ఆధారంగా చేసుకొని వ్యవసాయ దారులుగా తయారయినారు. పూర్వకాలంలో వారు గోనె సంచులను తయారుచేసి, వ్యవసాయదారులకు విక్రయించి జీవించేవారు. కాని ఈ నవీన కాలంలో మిల్లులలో గోనె సంచులు తయారయి, చౌకగా లభించటం వల్ల బంజారాలు వాటిని తయారు చేయటంలేదు. బంజారాలు నేడు తమ సంచార జీవితానికి స్వస్తి పలికి కొంతమంది వ్యవసాయదారులుగాను, మరికొందరు కూలీలుగాను వున్నారు. అంతేగాకుండా వారు సున్నం, కట్టెలను గాడిదలపై వేసుకొని చుట్టుముట్టు పల్లెల్లో, పట్టణ ప్రాంతాలలో అమ్ముకుంటూ జీవనం సాగిస్తున్నారు.

<u>నేటి బంజారాల స్థితిగతులు</u> :— నవనాగరిక ప్రపంచానికి దూరంగా ఎక్కడో మారుమూల అడవులలో, కొండలలో జీవిస్తున్న ప్రకృతిమాత ముద్దుబిడ్డలు బంజారాలు. వారు చిరకాలంగా యితరప్రాంతాల వారి దోపిడికిగురై నిరాదరణతో, పేదరికంతో, అజ్ఞానంతో, అజ్ఞానంగా మగ్గు తున్న అమాయకులు, దేశంలో నానాటికి వస్తున్న మార్పులు వారికి తెలియవు. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం, అభివృద్ధి ఫలితాలు వారికి అందటం లేదు. ప్రాథమిక అవసరాలు కూడ లేని దయనీయస్థితిలో వారు జీవితాన్ని

గడుపుతున్నారు. వారికి పక్కా-యిళ్లు లేవు. ఉన్న ఇళ్లలో కరెంటు దీపాలు కూడా చాలా చోట్ల లేవు. వారి తాండాలకు (గూడెంలకు) సరియైన రాక పోక సౌకర్యాలు లేవు, వారికి విద్య, ఆరోగ్య సౌకర్యాలు కూడా తగినంతగా లేవు. చదువుకోవడానికి పాఠశాలలు తగినన్ని లేవు. నేడు దేశంలో రాష్ట్రంలో జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలను గురించి నిజానికి వారికి చాలా తక్కువగా తెలుసు. మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చి దాదాపు నాలుగు దశాబ్దాల తర్వాత కూడ ఇదే పరిస్థితి కొనసాగడం చాలా గర్హనీయం.

నేటి బంజారాలు అక్షరజ్ఞానం ఏమాత్రం లేక అర్ధనగ్నంగా ప్రాచీన సాంప్రదాయాలపై ఆధారపడి జీవిస్తున్నారు. ఈ అమాయికులకు విద్యపట్ల నిర్లిప్తత ఏర్పడింది. ప్రాథమికసౌకర్యాలు వీరికి అందకపోవడం వల్ల వీరు నికృష్ట జీవితాన్ని గడపుతున్నారు. నేడు కూడా అనేక తాండాలకు రహదారి సౌకర్యాలు లేక పోవడంవల్ల ఉపాధ్యాయులు సుదూర బంజారా ప్రాంతాలలో పనిచేయడానికి ఉత్సాహం చూపకపోవడంవల్ల వీరిలో విద్యా వ్యాప్తికి అవరోధాలు ఏర్పడ్డాయి.

మధ్యదళారీ వ్యాపారస్థులు అనూహ్యమైన, ఆశ్చర్యకరమైన పద్ధతులలో విధానాలతో బంజారాలను నిట్టనిలువునా ముంచేస్తున్నారు. ఈ వ్యాపారస్థులు అవలంభించే పద్ధతులు కూడా చాలా విచిత్రంగా ఉంటాయి. పంటచేతికి రాని సమయంలో, తుపానులకు కలువుకు గురియైనప్పుడు, అపద సమయాలలో చిక్కుకున్నప్పుడు, వివాహ సందర్భాలలో నామ మాత్రమైన సొమ్మును బంజారాలకు వ్యాపారస్థులు హెచ్చువడ్డీకి ఇస్తారు. వాళ్ల వాళ్ల అవసరాలను, ఇబ్బందులను గమనించి యోగ్యతనుబట్టి సొమ్మును పెట్టుబడి పెడతారు. ఇది ఒకరకంగా విషవలయంగా చెప్పుకోవచ్చు. బంజారాల సాంస్కృతిక, వారసత్వ, ఆర్థిక సంబంధమైన బలహీనతలను ఆధారంగా చేసుకొని మధ్యదళారీలు పలువేషాలువేసి బంజారాలను నిలువునా దోపిడి చేస్తున్నారు.

మధ్యదళారీలు బంజారాల బలహీనతలను ఆధారంగా చేసుకొని వారు పండించే ఖరీదైన, విలువైన సరుకులను నామమాత్రపు ధరలకు

కొనుగోలుచేసి, దిగువ ప్రాంతాలలో అమ్మి విపరీతంగా లాభాలు గడిస్తారు. గడిస్తున్నారు. బంజారాలు పండించే పలురకాల పంటలు, కూరగాయలు, సేకరించే అటవీ ఉత్పత్తులు (తేనె, సుగంధ ద్రవ్యాలు, పసుపు మొదలైనవి) కేవలం వారు తీసుకొన్న అప్పుమీద చక్రవడ్డీని తీర్చడానికి సరిపోతాయి. అసలు అప్పుమాత్రం అలాగే ఉంటుంది. మాటయిచ్చిన తర్వాత తప్పటం బంజారాల నిఘంటువులో లేదు. అవసరమైతే భార్య శరీరంమీది వెండి, బంగారు నగలు చివరికి పొలం, పశువులు, మేకలు, గాడిదలు మొదలైనవాటిని అమ్మి అప్పు తీరుస్తారు. ఈ బలహీనత వారిపాలిట శాపంగా, మధ్యదళారీల పాలిటవరంగా మారింది. మధ్యదళారీలు వారిని మరొకవిధంగా కూడ దోపిడీ చేస్తారు, చేస్తున్నారు. దీనినే "నేస్తం పేరుతో దోపిడీ" అంటారు. అంటే మైదాన ప్రాంతానికి చెందిన వ్యాపారస్థుడు ఒక గ్రామానికి వెళ్లి ఆగ్రామ పెద్దతోనో, కులపెద్దతోనో (నాయకునితోనో) నేస్తం చెస్తాడు. అప్పుడు ఆవ్యాపారి కులపెద్ద చేతిలో పుష్పంపెట్టి ఆదినం నుంచి నేస్తం చేస్తున్నట్లు వాగ్దానం చేస్తాడు. అప్పటినుంచే ఖచ్చితంగా మొదలవుతుంది బంజారాల పతనం. నేస్తం ముసుగులో మధ్యదళారీలు బంజారాలను దోచుకోవడానికి పునాది వేస్తాడు. నేస్తం ప్రారంభించిన మధ్యదళారీ తరచుగా ఆ కుల పెద్దను గ్రామ పెద్దను స్వదేశీ, విదేశీ మద్యంతో ముంచుతాడు. మందు పీకల వరకు త్రాగిన కులపెద్ద, గ్రామ పెద్దలు ఆ గ్రామంలో పండే ప్రతి పంటను (వస్తువును) తనకుమందు పోయించిన వ్యక్తికే అమ్మాలనే నిబంధన పెడతాడు. అందువల్ల బంజారాలు మరొకవ్యక్తి తన సరుకుకు ఎక్కువధర యిస్తానన్నా గొర్రె కసాయివాడిని నమ్మినట్లు మధ్యదళారీని నమ్మి అతనికే సరుకు అమ్ముతాడు. అంటే బంజారాలకు తాము పండించిన సరుకులను స్వంతంగా అమ్ముకోవడానికి కూడా స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు ఉండవు వారుకుల పెద్దల చేతిలో కీలు బొమ్మలుగా ఉంటారు.

నేడు మనదేశంలో రాష్ట్రంలో స్థాపించిన "గిరిజన సాంఘిక సంక్షేమ శాఖ" బంజారాలు పైన తెల్పిన విధంగా మధ్య దళారీలకు, తీవ్ర వాదుల ప్రభావానికి గురికాకుండా తప్పుకోవడానికి, సామాజిక జీవన స్రవంతిలో కలసి పోయేటట్టు చేయడానికి వీలుగా అనగా ప్రభుత్వ కార్య

కళాపాలను గురించి బంజారాలలో ప్రచారంచేసే ఉద్దేశ్యంతో 8 ప్రత్యేక ప్రచార విభాగాలను నెలకొల్పింది. ఈ శాఖ ప్రభుత్వానికి బంజారాలకు వారధి వంటిది. రాష్ట్ర ప్రభుత్వ విధానాలను, కార్యక్రమాలను, ప్రభుత్వం సాధించిన విజయాలను బంజారాలకు తెలియజెప్పడానికి కృషి చేస్తూ కార్య క్రమాలపై, విధానాలపై ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవడానికి ఈశాఖ తోడ్పడుతూ ఉంటుంది ఈ ప్రచారోధ్యమ సమయంలో ప్రభుత్వానికి సంబంధించిన విద్య, వైద్య, ఆరోగ్య పశుసంవర్ధక, వ్యవసాయశాఖలు బంజారాలకు సేవలందించడం ద్వారా వారి అభివృద్ధికి, అభ్యున్నతికి తోడ్పడం ఈ ప్రచారోద్యమ ప్రత్యేకత.

ఎక్కడో కొండలలో పుట్టి, కోనలలో పెరిగి, అడవి మృగాలతో చెలిమిచేసి, నాగరిక సమాజానికి దూరంగా ఆకులు, అలములు, కొండలే అండగా. ఆడవులే గుడిసెలుగా, కోనలే పాఠశాలలుగా దయనీయస్థితిలో పెరిగే బంజారాజాతి వారికి నాగరికత అనే తిలకాన్ని వారి నొసటదిద్ది, తెలుగుసంస్కృతి అనే పాలుపట్టి పోషించేందుకు నేటి రాష్ట్రప్రభుత్వం కృత నిశ్చయంతో కంకణం కట్టుకుంది. అందుకు అనుగుణంగానే నేడుప్రభుత్వం వారికి పక్కా యిళ్లు నిర్మించి యివ్వడమే గాకుండా, వ్యవసాయం చేసుకోవ డానికి బంజరు భూములను పట్టాలుగా యిస్తూ, వ్యవసాయ పనిముట్లు, ఎరువులు. బండ్లు, ఎద్దులు, ట్రాక్టర్లు మొదలైన వాటిని తక్కువ వడ్డీలకు బ్యాంకుల ద్వారా సొమ్మును మంజూరు చేస్తున్నది. అంతేగాకుండా వారి పిల్లలకు విద్య, ఉద్యోగ విషయాలలో ప్రత్యేక రాయితీలను కల్పిస్తోంది.

తమతో సమానంగా పుట్టిన గిరిజనేతర మానవుడు అభివృద్ధి ఆలయంలో పెరుగుతుండగా, అవే హక్కులు కలిగిన గిరిజన మానవుడు అర్ధనగ్నంగా మానవతకు దూరంగా, మమతకు ఆవలిగట్టున నిస్సహాయ స్థితిలో ఏ అభ్యుదయం లేక పెరగడం విచిత్రిని సూచిస్తుంది. అసమానతకు నిదర్శనమవుతుంది. ఎప్పుడు అభ్యుదయ పథకాలు గుడిసె గుడిసెకు, గడప గడపకు, గుండె గుండెకు, చేరుతాయో, అప్పుడే నిజమైన సమసమాజస్థాపనం, సాంఘిక సమానత్వం నిత్యమై నిలిచిపోతాయి. వైరాగ్యంలో, నిర్భాగ్యంలో మగ్గుతున్న వారికి సరికొత్త ఊపునిచ్చి,

సమాజం ఆరోగ్యవంతంగా, పరిపుష్టిగా, ఉండేందుకు నేటిరాష్ట్ర ప్రభుత్వం ఎన్నో ప్రణాళికలు ప్రవేశ పెట్టింది, పెడుతోంది. నేటి నాగరికత, సంస్కృతి వికాసాదులు మొదలగు అభ్యుదయపథక విశేషాలను గిరిజనులకు తెలియజెప్పడం ఒక విశేషం. వారిసమగ్రాభివృద్ధే నేటి ప్రభుత్వ ధ్యేయం. వారి సుఖశాంతులే రాష్ట్రప్రగతికి ప్రతీకలు.

<u>విద్యావ్యాప్తికి అవరోధాలు</u> :— బంజారాలలో తల్లి కడుపులో శిశువు ఉండగానే, పుట్టబోయే ఆశిశువు మరణించే వరకూ కష్టించి పనిచేసినా తీరని అప్పులు తండ్రి చేస్తాడు. కాని మధ్యదళారీ వ్యాపారస్థులు, భూస్వాములు దానిని గోరంతలు కొండంతలు చేసి వారిని తమ కబంధహస్తాలలోనే ఉండి నలిగిపోయేటట్లు చేస్తారు. బంజారాలలో ఎవరైనా తెగించి వారి పిల్లలను చదివించదలచుకున్నా వారికి అనేక ఆర్థిక సమస్యలు ఎదురైతాయి.

బంజారాల దుస్థితిని దృష్టిలో ఉంచుకొని నేడు ప్రభుత్వం పట్టణాలలో చదువుకోవడంకోసం సంక్షేమ వసతి గృహాలను (హాస్టల్స్) నెలకొల్పింది. పట్టణాలలో చేరిన బంజారా విద్యార్థికి తెలుగు నేర్చుకోవడానికి దాదాపు 5 సంవత్సరాలు పడతాది. అంటే అతడు తాండానుంచి చదువు కోసం పట్టణానికి వచ్చుసరికి అతని వయస్సు కనీసం 5 సంవత్సరాలు ఉండాలి. అతడు తన మాతృభాషకాని తెలుగునేర్చుకోవడానికి 5 సంవత్సరాలు పడతాది. అనగా మొత్తం అతని వయస్సు 10 సంవత్సరాలు అయ్యేనాటికి అతడు తెలుగు నేర్చుకోవడానికే కాలం సరిపోతాంది. దీనికి ముఖ్య కారణమేమిటంటే అతని మాతృభాష లంబాడీ భాష కాబట్టి అతడు తెలుగు నేర్చుకోవడం కోసం 'అ' నుండి మొదలు పెడ్తాడు. ఆ తరువాత తరగతులలో హిందీ ఇంగ్లీషు భాషలు నేర్చుకొంటాడు. పదవతరగతి వరకు వివిధ భాషలు నేర్చుకోవడానికి దీర్ఘ కాలం సరిపోతాది. ఇలాంటి పరిస్థితులలో బంజారా విద్యార్థి తన సామర్థ్యాన్ని పెంచుకొని ఇతరులతో పోటి పడటానికి అవకాశమేలేదు.

బంజారాలలో తల్లిదండ్రులు విద్యావంతులు కాకపోవడం మరొక కారణం. వారికి తమ పిల్లలను ఏవిధంగా చదివించుకోవాలో తెలియదు.

బంజారా విద్యార్థులు సెలవు దినాలలో వసతిగృహాలనుండి ఇంటికి రాగానే తల్లిదండ్రులు వారిని కూలిపనులకు పంపిస్తారు అంతేగాకుండా వారు పని చేస్తున్న భూస్వాములకు వెట్టిచాకిరి చేయడానికి పంపిస్తూ ఉంటారు. అందు వల్ల బంజారా విద్యార్థులు పరీక్షలలో ఉత్తీర్ణులు కాలేక పోతున్నారు. బంజారాలలో ఏకొద్ది మాత్రమే కష్టపడి చదువులు చదువుతున్నారు.

బంజారాలలో పై చదువులు చదివినవారు తమను కని పెంచిన తల్లిదండ్రులనే పూర్తిగా మరచిపోతున్నారు. అంతేగాకుండ వారి తల్లి లంబాడీ దుస్తులతో వస్తే తమపిల్లలు భయపడుతారని తమ తల్లిదండ్రులను ఇండ్లలోకి రానివ్వటంలేదు. తల్లిదండ్రులు లంబాడీభాష మాట్లాడితే తమను ప్రక్కవారు లంబాడీలుగా గుర్తిస్తారని లంబాడీ భాషలో మాట్లాడటం లేదు. లంబాడీ వారు పనిమీద ఆఫీసుకు వెళ్లితే ఇతరులైనా వారిని పలుకరించి వారి పనులు చేసిపెడతారు. కాని, స్వకులస్థులు అని బంజారా ఉద్యోగులు పురుగును దులిపినట్లు దులిపి వేస్తున్నారు. ఇది చూడడానికి వినడానికి చాలా శోచనీయమైన విషయం. బంజారా యువకులు తమ తల్లిదండ్రులు ఎన్నో కష్టనష్టాలకు ఓర్చుకొని. కొండంత ఆశతో పస్తుండి చదివిస్తే వారిని ఆవిధంగా మరిచిపోవటం, కించపరచడం తమలో ప్రవహిస్తున్న రక్తాన్ని అవమానించడం అవుతుంది. ఈ పద్ధతి మారాలని తల్లిదండ్రుల, విజ్ఞుల ఆశ.

<u>రాజకీయ రంగప్రవేశం :—</u> బంజారాలలో రాజకీయ రంగప్రవేశం చేసిన వారు చాలాతక్కువనే చెప్పవచ్చు. రాజకీయాలలో కొమ్ములు తిరిగిన వారిని వేళ్లపై లెక్కించవచ్చు. మధ్యప్రదేశ్‌లో శ్రీ వసంతరావు పూల్సింగా నాయక్ (వి.పి. నాయక్) తన విద్యార్థి జీవితంలో రాజకీయజ్ఞాన మార్జించి 1926 లోనే బంజార సంఘప్రచారం సాగించారు. శ్రీ పి.వి. నాయక్ పునడ్ మునిసిపల్ కౌన్సిల్‌కు 1946 అధ్యక్షుడుగా కావటంతో ఆయన రాజకీయ జీవితం ప్రారంభమైంది మధ్యప్రదేశ్ అసెంబ్లీకి 1952 లో సభ్యుడిగా ఎన్నికయ్యారు. ఆ కాలంలో మధ్యప్రదేశ్ డిప్యూటి రెవిన్యూ మంత్రిగా నియమితులయ్యారు. 1956 లో రాష్ట్రాల పునర్విభజన అనంతరము ఆయన శ్రీ వై.బి. చవాన్ నాయకత్వాన గల మహారాష్ట్ర

మంత్రి వర్గంలో రెవిన్యూ మంత్రిగా పనిచేశారు. ఆ తరువాత ఆయన న్యాయ, వ్యవసాయశాఖల మంత్రిగా పనిచేశారు. శ్రీ వి.పి. నాయక్ 1963 నుండి 1974 వరకు మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేయడం జరిగింది. ఆయన 1969 నుండి 1970 వరకు వివిధరాష్ట్రాలు పర్యటించి గిరిజనుల సమస్యలను తెలుసుకొని కేంద్రప్రభుత్వానికి ఒక నోటీసు సమర్పించారు. ఆయన ఏకధాటిగా దశాబ్దకాలంపాటు మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా పనిచేసి విశిష్టమైన ఖ్యాతి నార్జించినారు. ఆంధ్రప్రదేశ్ విషయానికివస్తే శ్రీ రవీంద్ర నాయక్, అమర్‌సింగ్ తిలావత్, జి. స్వామినాయక్, ఎ. చందులాల్, బద్దు చౌహాణ్, ఏ. గోవిందనాయక్, క్రీ. శే. యల్. నరసింగనాయక్, ఇ. గోపాల్ నాయక్, అమరసింగ్ రాటోడ్, బి. స్వామినాయక్ లాంటి వాళ్లు రాజకీయ రంగ ప్రవేశం చేసారు, నిజంగా వీరు లంబాడీలకు సహాయం చేస్తున్నారా అంటే అది వేరే విషయం. అంతేగాకుండా కిందిస్థాయికి వస్తే మండలాధ్యక్షులు, సర్పంచ్‌లు రాజకీయం తెలియక వారు మళ్లీ భూస్వాముల సలహాలు పాటిస్తున్నారు. అందువల్ల మనప్రభుత్వం రిజర్వేషన్ ఆధారంగా సీట్లు కేటాయిస్తే వీరు బాగా రాజకీయాలలో నిలదొక్కుకోగలుగుతారు.

భారతదేశంలో దాదాపు ఐదు కోట్ల పై చిలుకు గిరిజనులున్నట్లు తెలుస్తోంది. ఆంధ్రప్రదేశ్‌లో నిజామాబాద్, వరంగల్, నల్గొండ, ఖమ్మం జిల్లాలలో వీరు ఎక్కువగా జీవిస్తున్నారు. ఇప్పటి వరకు గిరిజనులలో అక్షరాస్యత దాదాపు 8 శాతం. బంజారాలు స్వాతంత్ర్యం రాకముందు ఎలా వుండేవారో నేటికి దాదాపు అలాగే ఉన్నారు. రిజర్వేషన్లవల్ల పిల్లలు ఇప్పుడిప్పుడే చదువుకోగలుగుతున్నారు. వారి ఆర్థిక పరిస్థితిలో ఏమీ మార్పు రాలేదు. చదువుకొని ఉద్యోగాలు చేస్తున్నవారు చాలా తక్కువగా ఉన్నారు.

రాజకీయంగా, సాంస్కృతికంగా, సాంఘికంగా, ఆర్థికంగా బంజారాల పెరుగుదల పదిశాతం మాత్రమే. వారిని అభివృద్ధి పరచడానికి తొలిమెట్టుగా వారి వంశగొప్పతనాన్ని తెలిపే గ్రంథాలు రచించి ప్రచురించాలి. ఉపన్యాసాలు, ఉపదేశాలు ఇచ్చి వారి అంతరంగంలో మార్పు రావడానికి ప్రయత్నం చేయాలి. బంజారాలు పూర్వం ఏ వంశంవారో,

ఎందుకు ఈవిధంగా మారిపోయారో, వారివంశగౌరవాన్ని నిలబెట్టుకోవడానికి ఏమిచేయాలో వారికి బోధించి ప్రేరణ కలిగించాలి. అప్పుడే వారు మనోనిబ్బరంతో ఎవరి సహాయం లేకుండా అభివృద్ధి చెందగలరు. మేము కూడా ఈ సమాజంలో గౌరవప్రదమైన వ్యక్తులమనే భావం వారిలో కలగాలి, రావాలి. అదే వారి అభివృద్ధికి నాంది కాగలదు.

బంజారాల విలక్షణత :— ఆంధ్రదేశంలో నివసిస్తున్న గిరిజనులలో ప్రజలను విశేషంగా ఆకర్షించేవారిలో బంజారాలు ఒకరు, ఎంతమందిలోనైనా సరే వీరిని గుర్తించడం సులభం. అందులోను బంజారా మహిళలు తమవేష భూషణాలలో ఇతర మహిళలకంటే భిన్నంగా ఉంటారు. "One of the most fascinating tribes of our Country are the banjaras whose colourful dress and ormate Jewellary mark them out to be a distinct cultural group".7 ఎరుపు వన్నెలంగా (కుట్టుపనితో చాలా అందంగా గాజు ముక్కలతో తయారు చేసిన లంగా), చేతిలో దంతపు గాజులు (మూట్), మట్టి గాజులు (బంగిడి), మెడకు వేసుకొనే పలురకాల హారాలు (కంఠపట్టియ), ముఖానికి ఇరువైపుల ముంగురులకు వేలాడునట్లు కట్టబడి వుండే వెండి సొమ్ములు (ఘుగరీ), చేతివ్రేళ్ల నిండా ఉంగరాలు, కాలివ్రేళ్లకు మట్టెలు (అంగుట్లా, కాళ్లకు కడియాలు (కస్) — ఇవి మాత్రమేగాక తలమీద కప్పుకొనే వస్త్రం. ఇవి వీరి ప్రత్యేక వేషభూషణాలు. చివరికి వారు ఉపయోగించే వక్కాకు సంచి కూడా చాలా ఆకర్షణీయంగా ఉంటుంది. మగవారి వేషభూషణాలలో చెప్పుకోదగ్గ ప్రత్యేకత ఏమీలేక పోయినప్పటికీ తలమీద ఎర్రరుమాలు (పాగ) ఉంటుంది. ఈ కులంలోని ఆడ మగ యిద్దరూ ధృఢకాయులు. వారి వన్నె ఎరుపు. వారిలో నల్లగా ఉండటం చాలా తక్కువ. వారు తమ జాతి వారిని 'గోర్‌బాయి' అని పిలుస్తారు. 'గోర్' అంటే ఎర్రగా ఉండే, 'బాయి' అంటే సోదరుడు అని అర్థం చెప్పుతారు. హిందీలో 'గోరా' అంటే గోధుమ వన్నెగల అని అర్థం.

బంజారాల వివాహ పద్ధతులలో కూడా యిప్పుడిప్పుడు కొన్ని మార్పులు వస్తున్నాయి. వారిలో బాల్య వివాహం లేదని చెప్పవచ్చు.

పూర్వం అన్న చనిపోతే అన్న భార్యను తమ్ముడు పెండ్లి చేసుకొనేవాడు. కాని ఇప్పుడు అది నిలిచిపోయినది. ఎందుకని వారిని ప్రశ్నిస్తే అన్న భార్య తల్లితో సమానమని చెప్పుతారు. వీరు అక్క కూతురును పెండ్లి చేసుకోరు. కాని మేనమామ కూతురును పెండ్లి చేసుకొంటారు. వీరు తమకంటే పై జాతిలో పెండ్లి చేసుకొంటే అభ్యంతరం లేదు, కాని తమకంటే తక్కువ జాతిలో పెండ్లిచేసుకోరు. ఒకప్పుడు పెండ్లి సమయంలో స్త్రీలు ఏడ్చేది సామాన్యంగా ఉండేది. కాని దానికి ఇప్పుడు ప్రోత్సాహం లేదు. స్త్రీలు ధరించే ఘుగరీని పెండ్లికూతురుకు పుట్టింటివారు ఇస్తే చేతికి ధరించే దంతపు గాజులను (మూట్) అత్తింటివారు ఇస్తారు. ఘుగరీ, మూట్ — ఇవి రెండే ముత్తయిదువ లక్షణాలు. ఇప్పుడిప్పుడు వీరు కూడా తాళి కట్టే సంప్రదాయాన్ని పాటిస్తున్నారు. బంజారాలకు ఒకే వంశంలో వివాహాలు జరుగవు. దానిని "భూక్యా" అంటారు.

<u>బంజారాల న్యాయ విచారణ</u> :— బంజారాలు తగాదాలు వస్తే సామాన్యంగా కోర్టులకు వెళ్లరు. తమలోతామే విచారణచేసి పరిష్కరించుకొంటారు. ఇద్దరిమధ్య వివాదం వచ్చి పోట్లాడే ఘట్టానికొచ్చినపుడు ఆ పోట్లాటను నిలిపివేయడానికి ఆ ఇద్దరి మధ్య యితర బంజారాలు వచ్చి అడ్డునిలుస్తారు. అలా రావడం వారి కర్తవ్యం. దీన్ని మించి పోట్లాట ప్రారంభమైతే ఒక మధ్యమనిషి తన రుమాలు తీసి ఒకకొన పట్టుకొని దానిని వారిద్దరి మధ్య విసరుతాడు. అది వారిపాలిట లక్ష్మణరేఖ. వారు తమ కుల నియమాలను పాటించాలని హెచ్చరిక. ఈ హెచ్చరికలను అతిక్రమించి పోట్లాడితే అప్పుడు వారిద్దరూ శిక్షార్హులే,

న్యాయ విచారణ తాండాలోనే జరుగుతుంది. ఇంటికొక మనిషి ప్రకారం అందరు ఒకచోట చేరుతారు. వారి తీర్పుకు వాది ప్రతివాది యిద్దరూ బద్ధులై ఉండాలి. వారు యిచ్చిన తీర్పును మీరినవాడు కులం నుండి వెలి అవుతాడు ఎవరైనా తప్పుచేసి జైలుకుపోతే వారు తిరిగివచ్చిన తరువాత కూడా వాని నుంచి తప్పు కట్టించుకొని కులంలోనికి పిలుచుకొంటారు. వాని నాలుక కాల్చి, వానిమీద గోమూత్రం, టెంకాయ నీళ్ల

చిలకరించి శుద్ధిచేస్తారు. ఇద్దరిమధ్య తగాదావచ్చి ఆ తగాదా పరిష్కారానికి మనిషి సాక్షి ఏది సహాయానికి రాకపోతే, అప్పుడు దైవ సహాయాన్ని కోరతారు. ఉదాహరణకు ఒకనిమీద దొంగతనం ఆరోపణ వచ్చిందని భావిస్తారు. వాడు తాను నిర్దోషి అని నిరూపించేందుకు ఎర్రగా కాగబెట్టిన ఇనుప కర్రను రెండు చేతులతో పట్టుకొని దూయాలి. అప్పుడు అతనికి ఏవిధమైన గాయం కాకపోతే అతడు నిర్దోషి అని నమ్ముతారు. నేడు యిలాంటి సత్యనిరూపణ క్రమంగా తగ్గుతూ వస్తూంది.

బంజారాల స్వభావం :— బంజారాలు సామాన్యంగా ఇతర ప్రజలతో కలవరు. కాని ఇతరులతో కూడి పనిచేస్తారు. ఊరు, పేట సంతలకు పోతారు. వీరు వేరేకులస్థులు ఉండే ఊరిలోపల నివసించడానికి ఇష్టపడరు. ఊరిబయట గుంపులు గుంపులుగా ఇండ్లను కట్టుకొని నివసిస్తారు. దానిని "తాండా" అని పిలుస్తారు. ఇలా నివసించడానికి వారు చెప్పే కారణం ఒకటి ఉంది. ఇతర కులాలవారు పెంచే కోళ్ళు తమ ఇండ్లలో ప్రవేశించి అపవిత్రం చేస్తాయని, వారి దేవుడు అయిన సేవాభాయికి కోళ్లు సరిపడదని అంటారు. వీరు పందులను పోకరు. వారి తాండాలకు ప్రత్యేకమైన పేరుండదు. వారు నివసించే తాండాకు దగ్గరున్న ఊరు పేరు మీదనే పిలుస్తారు. ఉదా॥ కొట్టాలపల్లి తాండా, కూడేరు తాండా, ఎద్దులపల్లి తాండా రామగిరి తాండా, పాల్యం తాండా, నరసాపురం తాండా, పందికుంట తాండా, చిన్నకుంట తాండా మొదలైనవి.

సాధారణంగా బంజారాలలో మగవారి పేరు చివర "నాయక్" అని, ఆడవారి పేరు చివర "బాయి" అని ఉంటాయి.

ఉదా॥

| మగవారి పేర్లు | ఆడవారి పేర్లు |
|---|---|
| బాలాజీ నాయక్ | సతీబాయి |
| గోవింద నాయక్ | రాధాబాయి |
| రామానాయక్ | గంగాబాయి |
| జయనాయక్ | ఉమాబాయి |

| మగవారి పేర్లు | ఆడవారి పేర్లు |
|---|---|
| లక్ష్మనాయక్ | గౌరిబాయి |
| క్రిష్ణానాయక్ | విజయలక్ష్మిబాయి |
| భీమానాయక్ | సరస్వతిబాయి |
| కేశవనాయక్ | సుశీలాబాయి |
| శంకర్‌నాయక్ | శాంతాబాయి |
| సుబ్బానాయక్ | చంద్రకళాబాయి |
| స్వామినాయక్ | కమలాబాయి |

బంజారా జాతిలో సాధారణంగా భిక్షగాళ్లు కనబడరు. భిక్ష మెత్తడం అతిహీనమని వీరి అభిప్రాయం. వీరికి తమ జాతిపట్ల చాలా అభిమానం, వీరు సంప్రదాయ నిష్ఠులు. అందువల్ల ఈ కులం నుంచి వేరొక కులానికి, మతానికి పరివర్తనం (మార్పు) అయిన నిదర్శనాలు చాలా తక్కువ. ఎవరైనా తమజాతిలోనికి చేరడానికి ఇష్టపడితే వారికి స్వాగతముంటుంది. కాని వారికి నిజమైన ప్రవేశం మూడుతరాలు, కొన్ని చోట్ల ఏడుతరాలు గడచిన తర్వాతనే, అప్పటి వరకు వారు అస్పృశ్యులవలె ఉండాలి. ఇప్పుడిప్పుడు ఈ నియమాన్ని సడలిస్తున్నారు. నేడు ఈకులంలో చేరినవారు ఆరునెలలు లేదా సంవత్సరంలోపలనే అన్ని సదుపాయాలు పొందుతున్నారు. అనుభవిస్తున్నారు.

బంజారాలలో అప్పుచేసి వుంటే దానిని తాము చనిపోయేలోపల తీర్చాలని దృఢనిశ్చయం ఉంటుంది. ఒకవేళ తండ్రి అకస్మికంగా అప్పు తీరకముందే చనిపోతే అతని కొడుకులు గాని, మనుమలుగాని ఆ అప్పును తీరుస్తారు. బంజారాలలో నీతికి, నిజాయితికి ప్రాముఖ్యస్థానముంది.

## బంజారాల భాష

బంజారాలు తెలుగు ప్రజల మధ్య అక్కడక్కడ గుంపులు గుంపులుగా నివసిస్తూవుండే ప్రజానీకం. ఇంతకు ముందే చెప్పినట్లు వీరు ముస్లింలు ఉత్తరదేశం నుండి దక్షిణ దేశానికి దాడి చేసినప్పుడు వారి సైన్యంతోబాటు దక్షిణ దేశానికి వచ్చి స్థిరపడినారు. వీరు మూలస్థానం

బహుశా రాజస్థాన్. వీరి భాష ఇండో - ఆర్యన్ వర్గానికి చెందిన భాష అన్న విషయంలో ఏమాత్రం సందేహం లేదు. ఒక కాలంలో సంచార ప్రియులుగా ఉండిన వీరు ఇప్పుడిప్పుడే ఒక్కచోటనే నెలకొంటున్నారు. బంజారాలు సామాజికంగా, ఆర్థికంగా వెనుకబడిన జనం. వారిభాష తెలుగు భాష మధ్య భాషా ద్వీపంగా (Speech Island) ఉంది. తెలుగువారు బంజారాలు కంటే విద్యలో, నాగరికతలో, ఆర్థికస్థితిలో ముందు ఉన్నారు. అందువల్ల తెలుగుపై భాష, బంజారా కింది భాష. బంజారాభాష తెలుగు భాష నుండి వందలాది పదాలను స్వీకరించింది. కాని నాకు తెలిసినంత వరకు తెలుగు భాష బంజారా భాష నుండి ఏమియు స్వీకరించినట్లు లేదు. అందువల్ల ఇది ఏక పక్షీయ స్వీకరణకు అత్యుత్తమ ఉదాహరణం. సంచార ప్రియులైన బంజారాలకు పశుపాలననే ముఖ్యవృత్తిగా చేసికొన్నారు. వీరికి కృషిగురించి అంతగా అవగాహన వున్నట్లు లేదు. ఈ అంశం బంజారా భాషలోని జానపద గేయాలు కూడా కొంతవరకు బలపరుస్తాయి. బంజారా భాషలో వుండే కృషికి సంబంధించిన పదాలు వారు ఏభాషా ప్రాంతం మధ్య నివసిస్తున్నారో ఆభాష నుండియే స్వీకరింపబడ్డాయి. ఉదాహరణకు ఆంధ్రదేశంలో ఉండే బంజారాలు కృషికి సంబంధించిన పదాలను స్వీకరిస్తే, కర్ణాటకలో, తమిళనాడులో నివసిస్తున్న బంజారాలు తమతమ ప్రాంతీయ భాషలో వుండే కృషికి సంబంధించిన పదాలు స్వీకరించారు. బంజారాలు అనేక ఆంగ్లపదాలను కూడా వాడుతున్నారు. ఈ ఆంగ్లభాషా పదాలు ప్రాంతీయ భాషా ముఖాంతరంగానే బంజారా భాషలోనికి వెళ్లాయి. ఉదా॥ మోటారు, ట్రాక్టర్, ఆయిల్ మ్యాలు. హూటలు, కాలేజీ, కోర్టు, ఆసుపత్రి, (హాస్పెటల్) కోటు, షర్టు,, టవాలు, బనియన్, డ్రాయర్, కర్చీఫ్, వాచ్, గ్లాస్, కాఫీ, టీ, మొదలైనవి,

బంజారాలు విద్యావంతులై తమభాషను అభివృద్ధి పరచే సూచనలేమి ప్రస్తుతం కనిపించడం లేదు. అందువల్ల భాషా స్వీకరణంలో నిరంతరంగా మార్పులు జరుగుతుంటాయి. కాలక్రమేణా ఆభాషలో ఇప్పుడు ఉండే వ్యాకరణం కూడా కొంత మార్పును పొందుతుందని కూడా ఊహించవచ్చు.

ప్రస్తుతం శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్న మాజీ శాఖాధ్యక్షులు డాక్టర్ హెచ్. యస్. బ్రహ్మానందం గారు "గోర్ బోలి" మీద విస్తృతమైన పరిశోధన జరిపించారు. వారు జాతీయస్థాయిలో తమ పరిశోధనను కొనసాగిస్తూ, బంజారాల భాషమీద (గోర్ బోలి) విశ్వ విద్యాలయాల నిధుల సంఘానికి (U.G.C. కి) ఒక బృహత్తరమైన నివేదికను సమర్పించారు. వీరు బంజారాల భాష, సంస్కృతి మీద వివిధ దృక్కోణాలలో ఇంకనూ ఆసక్తికరమైన పరిశోధనను సాగిస్తున్నారు.

## బంజారాలలో సమైక్యతాభావం

సమాజంలో నలుగురి సభ్యుల కలయికకే సంఘమనీ, వ్యక్తుల మధ్య సహకారం అవసరమనీ, దీన్ని ప్రతియొక్కరు నియంతగా అలవర్చు కోవాలని విజ్ఞులు చెప్పుతారు. ఇది ప్రజాసంఘాల యుగం, యుగధర్మాని పాటించడం మానవ లక్షణం, కర్తవ్యంకూడా. ఈ సందర్భంలో సంఘంటే ఏమిటో బంజారా జాతీయులెల్లరు తెలుసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. సృష్టిలో గల ప్రతి ప్రాణికూడ ఒంటరిగా జీవించలేదు. ప్రతిజీవి మరొక జీవితో కలిసిమెలసి ఉండాలి. అందువల్లనే అనేక రకాల జంతువులు కూడ సమాజంగా గుంపులుగుంపులుగా చేరి జీవించడానికి అలవాటుపడ్డాయి. అలాంటప్పుడు జంతువులేకాక మానవులు తాము చేయుచున్న వృత్తులను బట్టి అనేక సంఘాలుగా ఏర్పడ్డారు. ప్రతి సంఘం పైకి రావాలనే నిశ్చయంతో పాటుపడతాది. ప్రతిజాతి కూడా ఉన్నత దిశలో పయనించి గౌరవా దరములు పొందడానికి సంఘీభావం ప్రధానం.

సంఘీభావమంటే అనేక మంది వ్యక్తులు ఒక్క విషయంలో ఏకాభిప్రాయాన్ని కలిగియుండటం. సంఘీబావం కలిగియున్నప్పుడు మానవులకు సమస్త బలములు కలుగుతాయి, ఉధాహరణకు చేతివేళ్లు ఐదు కలియుట చేతనే మనం ఏపనినైనా సులభంగా చేయగలుగుతున్నాం. అందులో ఏ ఒక్కటి తగ్గినా సక్రమంగా పనిచేయలేం. అధిక ప్రయాస పొందినా ఒక్కడికి చేతగాని పని, పలువురు సంఘంగా ఏర్పడి పాటుపడితే

ఆ పని సులభ సాధ్యమవుతుంది. ఎంతటి ఘనకార్యాలు అయినా సాధించ వచ్చు. సంఘం ద్వారా ఒకే అభిప్రాయం గల జాతీయులెల్లరు దూరంగా ఉన్నా, దగ్గరగా ఉన్నా, వారు కలియుడం సంభవించి నందువల్ల సమస్య లను బాగా చర్చించుకొని పరిష్కరిస్తారు. అందువల్లనే గాబోలు 'ఐకమత్యమే మహాబలం' అని పెద్దలు నొక్కి చెప్పారు. గురజాడ మహాకవి 'అన్నదమ్ముల జాతులు మతములన్నీ మెలగవలెనోయ్' అన్నమాటల్లు గమనింపదగినవి.

సంఘ సమావేశాలలో తరచుగా పాల్గొని మాట్లాడటం వల్ల, చర్చించుట వల్ల ధైర్యం, ఉత్సాహం కలుగుతాయి. తాము చేపట్టబోయే కార్యక్రమాలకు తోడ్పడేవారు ఆకార్యక్రమా లను ఆమోదించేవారూ కొందరు ఉన్నయెడల ప్రతి సంఘానికి ద్విగుణీకృత అభిమానం, బలం, జ్ఞానాభివద్ధి కలుగుతాయి. జాతీయులందరిలో ఐకమత్యం. సత్కార్యాచరణం మొదలగు వానియందు ఆసక్తికలిగినప్పుడే సంఘం బాగుపడుతుంది.

సంఘం ధర్మబద్ధమై, క్రమశిక్షణతో, ఐకమత్యంతో ఉండాలి, మెలగాలి. అప్పుడు ఆ సంఘం, మూడుపువ్వులు ఆరుకాయులుగా అభివృద్ధి చెంది, జాతీయులనందరిని ఒకేత్రాటిపై సక్రమ మార్గానికి తిప్పుతుంది. మానవులెల్లరు సంకుచిత తత్త్వాన్ని వీడి, సంఘభావం, ఐక్యత. ఏకత్వం, అలవరచుకొన్నప్పుడే సౌభాతృత్వం, సర్వసమానత్వం లభిస్తాయి.

స్వతంత్ర భారతదేశంలో ప్రతివర్గం వారు అభ్యుదయ మార్గంలో తమజాతుల అభివృద్ధికై సంఘాలను స్థాపించుకున్నారు. ఈ నేపథ్యంలో బంజారాజాతి ప్రాచీన చరిత్ర - సంస్కృతులను, గౌరవాదరణలను, సమాన ప్రతిపత్తులను కోలుపోయి అజ్ఞాన అంధకారంలో కొట్టుమిట్టాడుతూ, నీచస్థితిలో ఉండి, తోటి మానవుల దృష్టిలో సహ్యంగా ఎంచబడుతున్నది, అట్టి జాతిని జాగృతంచేసి, సంకుచిత నీచతత్త్వాలను పారద్రోలి వారికి క్రమశిక్షణ, విజ్ఞానం బోధించి తద్వారా ఐక్యతను సాధించి, సంస్కృతియెడ గౌరవాభిమానములను పెంపొందింపజేసి, సాంఘిక, ఆర్థిక, విద్యా, వైజ్ఞానిక రాజకీయరంగాలలో ప్రగతి పథంలో తీసుకపోవాలనే లక్ష్యంతో 1948 సంవత్సరంలో మొదటిసారిగా గుంటూరు జిల్లా వినుకొండలో సుగాలీ సంఘం స్థాపించబడినది.

బంజారాల సంఘస్థాపన క్రమంగా గ్రామ, తాలూకా, జిల్లా, రాష్ట్రాలకు వ్యాపించి చివరికి "అఖిల భారత బంజార సంఘం"గా వర్ధిల్లు చున్నది. ఈ సంఘం ప్రభుత్వం నుంచి కొన్ని రాయితీలను' సహాయాన్ని పొందుతూ, బంజారా కులంలో పూర్వం నుంచి వస్తున్న సాంఘిక దురాచారాలను, దురలవాట్లను మాన్పించి, సంఘ గౌరవాన్ని కాపాడుటకు తగు మార్పులు, మంచి కట్టుబాట్లు కొంతవరకు చేయగలుగు తుంది. బంజారా సంఘం చేయవలసినది ఎంతో ఉంది. ప్రభుత్వం నుండి తమకు కావలసిన హక్కులు సంపాదించుటకు, కులం పేరిట జరిగే దురాచా రాలను రూపుమాపుటకు, విద్యావంతులైన యువకులు సాహసించి పని చేయుటకై ముందుకు రావాలి. అంతేగాకుండా ప్రతిబంజారా స్త్రీ పురుషుడు తమజాతి యొక్క గౌరవాగౌరవాలను పాలు పంచుకొనుటకు హక్కుదారుల మని, వాటిని సమానంగా పంచుకొంటున్నామని గుర్తించిననాడే, గుర్తించి, కష్టించి పనిచేసిననాడే ఆ సంఘం రాణించి, లక్ష్యసాధనలో సఫలీకృత మవుతుంది.

బంజారాజాతిలో చదువుకొన్నవారు తక్కువనే చెప్పాలి. ఉద్యో గాలు చేస్తున్న వారి సంఖ్య కూడా చాలా తక్కువనే చెప్పవచ్చు. ఆ కొద్దో గొప్పో విద్య, ఉద్యోగాలు సంపాదించిన బంజారా యువతీ యువకులైనా చేయూతనివ్వనిదే సంఘం అభివృద్ధి చెందదుగదా! నేటి ప్రపంచ పురోభి వృద్ధిని దృష్టియందిడుకొని, అందరివలె తాము కూడా సంఘంలో గౌరవింప బడుటకు తమ స్వలాభం కొంతవరకు వదలుకొని సంఘాభివృద్ధికొరకు పాటుపడవలెనను దృక్పథాన్ని అలవరచుకోవాలి. "స్వంతలాభం కొంత మానుకు పొరుగువాడికి తోడుపడవోయ్, దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అన్న గురజాడ మాటలు నిజంగా భారతీయులెల్లరకు శిరోధార్యంలే, ఆచరణీయంలేనని గమనింపవలెను.

నేడు కొందరు తమ స్వంతపనులు, స్వలాభాలు చూచుకుంటూ, "ఎవరికివారే యమునాతీరు" అన్నట్లు కాలం గడుపుతూ సంఘవ్యవహారల పట్ల ఏమాత్రం ఆసక్తిని చూపలేకపోతున్నారు. దీనివలన వారు తెలిసి

యుండియు ఏరుదాటి తెప్పను తగలవేసినట్లు స్వసంఘాలకు అన్యాయం చేస్తున్నారు. అంతేగాకుండా బంజారా జాతిలో ఉన్నత చదువులు, ఉన్నత వుద్యోగాలు సంపాదించిన యువకులు కొందరు స్వజాతిలో చదువుకొని సద్గుణ సౌందర్యవంతులుగా ఉన్న యువతులను పెండ్లాడక, కట్నాలకు ఆశపడి ఇతర జాతి యువతులను వివాహమాడుతున్నారు. ఇది నిజంగా "తల్లిపాలుతాగి తల్లి రొమ్ముమ్మనే గుద్దినట్లు" లాంటిది. ఇది చాలా అన్యాయం. మరికొందరు జాతి పేరుతో ప్రభుత్వం ద్వారా సర్వ సౌకర్యాలను అనుభవిస్తూ, బయట మాత్రం కులం పేరు చెప్పకుండ, తమ బిడ్డలకు స్వజాతి భాషను మరపిస్తున్నారు.

విద్యావంతులైన యువతీ యువకులెల్లరు తమజాతిలో మొదట విద్యావ్యాప్తికై కృషి చేసిననాడే సంఘ ఆశయాలు చక్కగా సిద్ధిస్తాయి. రెండవది వారు కార్యదీక్ష, సంఘపు ప్రతిపనిలో పాల్గొనుచు, జాతి అభివృద్ధికై కృషిచేస్తున్న సంఘనాయకులకు చేయూతనిస్తూ, ఆదర్శప్రాయులై మార్గదర్శకులై ఉండాలి. సాధారణంగా ప్రతిపని చేయడానికి ఎన్నో సాధక బాధకాలుంటాయి. అందువల్ల వారికి పట్టుదల, కార్యదీక్ష ముఖ్యం. అవి లేనియెడల ఎంత గుండె నిబ్బరంగల మానవుడైనను ఏమియు సాధింపలేడు.

నేడు ప్రపంచంలో అభ్యుదయ భావాలు కలిగిన జాతులు, దేశాలు తమ కోరికలను, సమస్యలను నెరవేర్చుకొనడానికై ఎలా పరుగులువేస్తూ ముందుకు పోతున్నదో గమనించాలి. బంజారా జాతీయులెల్లరు సంఘీభావాన్ని అలవరచుకొని, స్వజాతి పరిస్థితులను గూడ గమనించి, భారత బంజారా సంఘం యొక్క పిలుపును అందుకొని, సంఘోద్ధరణకు శపథం బూనుట ఎంతైనా అవసరం.



# రెండవ అధ్యాయం

## గిరిజన సమాజం

### *గిరిజనులు – ఒక సాంస్కృతిక సామాజిక అధ్యయనం*

మానవ సాంస్కృతిక విజ్ఞానం అంటే మానవ సంస్కృతిని అధ్యయనంచేసే విజ్ఞానం. ఇందులో మానవజాతి విజ్ఞానం (Ethnology) మరియు మానవజాతి వివరణ విజ్ఞానం (Ethnography) అనే రెండు అధ్యయనాలు గిరిజనుల సంస్కృతిని అధ్యయనంచేసే అంశాలైనవి. సంస్కృతి పరిణామాన్ని మూడు దశలుగా గుర్తింపారు. 1. ఆదివాసి సంస్కృతి (Primitive Culture) 2. గ్రామీణ సంస్కృతి (Rural Culture) 3. నగర సంస్కృతి (Urban Culture) ఈ సంస్కృతి కాలానుగుణంగా మార్పు చెందుతూ వస్తూంది. సంస్కృతి అధ్యయనంలో సాంస్కృతిక వ్యత్యాసాలు చాలా ముఖ్యమైనవి. సంస్కృతి స్వరూపాన్ని అర్థంచేసుకోవడానికి ఈ గిరిజనుల సంస్కృతిని అధ్యయనం చేసే ప్రయత్నం మానవశాస్త్ర విజ్ఞానులకు అనివార్యమైంది.

గిరిజనులు అంటే ఎవరు? అనే అంశాన్ని గురించి కొంత చర్చ అవసరమని నాఅభిప్రాయం. ఎందుకనగా బంజారాలను గిరిజనులుగా మనం గుర్తించడం వల్ల ఈ విషయం అవసరమని నాఅభిప్రాయం. ప్రపంచమంతటా ప్రజలు పట్టణాలలో, పల్లెలలో నివసిస్తారు. వీరి సంస్కృతిని క్రమంగా మనం నగర సంస్కృతి. గ్రామీణ సంస్కృతి అని గుర్తించవచ్చు. ఈ రెండింటినేకాక వేరొక సాంస్కృతిక వర్గానికి చెందిన సంస్కృతిని మనం గుర్తించవచ్చు. అదే గిరిజనుల సంస్కృతి.

అనేక శతాబ్దాలనుండి కొండలలో, అడవులలో, ఎడారులలో, హిమప్రదేశాలలో ద్వీపాలలో, నివసిస్తూ ఉండే సామాజిక వర్గాలు నగర మరియు గ్రామీణ సంస్కృతి ప్రభావాలకు లోనుగాకుండా తమసంస్కృతిని ప్రత్యేకంగా కాపాడుకొంటు వచ్చింది. ఈ ప్రజలు తమదే అయిన ప్రత్యేక మైన భాష, ఆచార వ్యవహారాలు, సాహిత్యాలను కలిగి ఉంటారు. ఇవి నగర, గ్రామీణ సంస్కృతుల కంటే మిక్కిలి భిన్నంగా ఉండి మనకు అనాగరిక పద్ధతి అనికూడా అనిపిస్తుంది. ఈ విధమైన సామాజిక వర్గాలను సాంస్కృతిక మానవశాస్త్ర విజ్ఞానంలో గిరిజనులు అని పేర్కొన్నారు. ప్రపంచమంతటా ఈవిధమైన అనేక గిరిజన వర్గాలను గుర్తించవచ్చు.

భారతదేశంలో కులం తరువాత గిరిజనతెగ - ఈ రెండింటికి వుండే వ్యత్యాసాన్ని మనం గుర్తించాలి. ఈ విధమైన సమస్య ప్రపంచం లోని యితరదేశాలలో లేకుండా కేవలం భారతదేశంలోనే విశిష్టంగా ఉంది. భారతదేశంలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు కులాలు కాకుండా హరిజనులు చేరిన ఐదవజాతి కూడా ఉంది. ప్రారంభంలో వృత్తి కనుగుణంగా వర్గీకరింపబడిన కులవ్యవస్థ కాలక్రమంగా సామాజిక పీడిత సాధనమైంది. పైనచెప్పిన ఈ కులాలను విడిచిపెట్టి మిగతా హిందూ సామాజిక వర్గాలన్నింటిని 'గిరిజనులు' అని ప్రత్యేకంగా పిలవవచ్చు. ఈ గిరిజనులు పైనచెప్పబడిన కులాల వారితో కలియక చాలాకాలం స్వతంత్రం-గానే ఉండి తమసంస్కృతిలోని విశిష్టతను కాపాడుకొన్నారు. ఈ విధంగా ఇతర కులాల వారికి దూరంగా ఉండడానికి ఈ గిరిజనులు కొండలు, అడవి ప్రాంతాలలో నివసిస్తూ ఉండడమే ప్రధానకారణం. వీరిలో హిందూ ధర్మానికి సంబంధించిన కొన్ని అంశాలను మనం గుర్తించవచ్చు. కాని చాలా వెనుకటినుండియే హిందూధర్మ ప్రభావం నుండి ఈ గిరిజనులు తప్పించుకొన్నారు. కనుక తమకు విశిష్టమైన సంస్కృతిని రూపొందించు కొన్నారు. కాని ఈ అవకాశం కులాలకు లేదు.. కులాలు ప్రారంభమైనప్పటి నుండి హిందూధర్మం యొక్క వైదిక సంప్రదాయానికి లోబడ్డాయి. అందు వల్లనే ఒక కులానికి మరొక కులానికి సంప్రదాయాలలో ఎంత వ్యత్యాస మున్నప్పటికి అవి మూలభూతంగా హిందూధర్మం నుండి విడిపోవడానికి

వీలుగాలేదు. ఈకారణం వల్లనే హిందూధర్మ ప్రభావం ఏ ప్రమాణంలో జరిగింది. అనే అంశం, కులం మరియు గిరిజనతెగలకు ఉండే వ్యత్యాసాన్ని చూపించే సాధనమైంది.

తెగను గురించి "........... the tribe is a prospective caste which has not attempted to adopt itself to the sacred mould of Hinduism; the caste is a group, consiciously or not, voluntarily or not. has accepted atleast, in their broader definitions, the Principles of the traditional order the Brahmins have instituted" అని ప్రొఫెసర్ సిల్వియన్ గారు అభిప్రాయపడినారు.*8* గిరిజనులు కులాలుగా, తెగలుగా మార్పు పొందిన నిదర్శనాలు కూడా ఉన్నాయి. కాని గిరిజనులు జాతిగా ఎప్పుడుమార్పు పొందారు అని చెప్పడం ఎలా? దీన్ని గురించి నిర్మల్ కుమార్ బోస్ గారు ఈవిధంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. 'One might indeed say that tribes can be regarded as fully absorbed in the Hindu fold if Brahmin prietss perform Brahminical ceremonies for them during the three critical events of birth, marriage and death. If the latter are still celebrated by tribal rituals, then the communities are still true to their own faith inspiteof the fact that, in the outer fringes of their culture they participate in some of the ceremonies of their Hindu neighbours".*9*

పై అభిప్రాయ వివరణ ప్రకారం గిరిజనులు తమ కుటుంబాలలో జరిగే జననం, పెండ్లి మరియు మరణం అను ఈ మూడు సందర్భాలలో బ్రాహ్మణ పౌరోహిత్యానికి అవకాశం యియ్యకుండా తామే అన్ని ధార్మిక విధులను నిర్వహిస్తారు. ఈ పరిస్థితి ఎప్పటి వరకు ఉంటుందో అప్పటి వరకు గిరిజనులు తమ మూల రూపాన్ని పొందివుంటారు. ఈ విధంగా ఉంటూ హిందువులతో ఈ గిరిజనులు పండగ, జాతరలలో పాల్గొంటారు.

పైన తెల్పిన అభిప్రాయాలతోపాటు తెగను గూర్చి ఇంపెరీయల్ గెజిటీర్ లో ఈవిధంగా నిర్వచింపబడింది.10 "A tribe is a collection of families bearing a common name, speaking a common dialect, occupying or professing to occupy a common territory and is not usually endogamoms though originally it might have been so"

"ఒకేభాషను లేదా మాండలికాన్ని మాట్లాడు కొన్ని కుటుంబాలు, ఒకే ప్రాంతంలో నివసిస్తూ, సాధారణంగా తమలో తామే వివాహ సంబంధాలను ఏర్పరచుకొంటూ, ఒకేజాతి నామంతో వ్యవహరింపబడే సమాజాన్ని గిరిజన సమాజ"మని పేర్కొనబడింది.

డి.యన్. మజుందార్ గారు తెగను గూర్చి ఈవిధంగా నిర్వచించారు.11 'A tribe is a collection of families, bearing a common name, members of which occupy the same territory, speak the same language and observe certain taboos regarding marriage, proffession or occupation and have developed a well assesed system of reciprocity and mutuality of obligation'.

"ఒక తెగ అనగా కొన్ని కుటుంబాల కలయిక. వారందరి ఇంటి పేరు ఒకటే. కుటుంబ సభ్యులందరు ఒకే భూభాగాన్ని ఆక్రమించి ఉంటారు. వారందరు ఒకే భాష మాట్లాడుతారు. పెండ్లి, వృత్తికి సంబంధించిన కొన్ని విధి నిషేధాలను అందరు అనుసరిస్తారు. పరస్పరం ఇచ్చి పుచ్చుకోవడాలను వారు క్రమం తప్పకుండా అనుసరిస్తారు".

ధీరేంద్రనాథ్ మజుందార్ గారు భారతదేశంలో మార్పు పొందిన గిరిజనులను మూడు విభాగాలుగా గుర్తించారు.12

1, కులాలై సంపూర్ణంగా పరివర్తనం పొందిన గిరిజనులు.

2. హిందువులతో పాల్గొని కూడా తమ సంప్రదాయాలను, నమ్మకాలను కాపాడుకుంటున్న గిరిజనులు.

3. హిందూధర్మ ప్రభావానికి లోనుగాకుండా అధర్మం యొక్క పెద్దరికాన్ని సహించక తమ స్వాతంత్ర్యంకోసం ప్రత్యేకంగా పోరాడుతున్న గిరిజనులు.

"అస్సాంలోని "నాగా" మొదలైన గిరిజనులుతప్ప మిగతా అన్ని గిరిజన వర్గాలు కూడా ఒక స్థాయిలో (దశలో) కాకున్నా మరొకస్థాయిలో అయినా హిందూధర్మాన్ని స్వీకరించి ఉండాలి, అని "ఎరియర్ ఎల్విన్" చాలా కాలానికి పూర్వమే తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ఆయన ఆరోజు చెప్పినమాట ఈ రోజుకు కూడా గిరిజనులకు చక్కగా అన్వయిస్తొంది. గిరిజనులు అని గుర్తించాల్సివస్తే వారికి ప్రత్యేకమైన భాష ఉండాలి. కాని భారతదేశానికి ఈ నియమాన్ని చాలా ఖచ్చితంగా అన్వయించే దానికి వీలు పడదు: ప్రత్యేకమైనభాష ఉండే గిరిజనులవలె ప్రత్యేకమైన భాషలేని గిరిజనులు కూడా ఉన్నారు. కొంతమంది గిరిజనులు తాము నివసించే ప్రదేశంలో ప్రచారంలో ఉండేభాషనే మాట్లాడుతారు. ఈ భాష ఉపభాషగా ఉంటుంది.

ఒక గిరిజన వర్గంలో ఎంతజనాభా ఉండాలి? అన్నది ఇంకొక ముఖ్యమైన సమస్య. సామాన్యంగా గిరిజనులవలె జనాభా 5000 కంటే ఎక్కువ ఉండరాదనే అభిప్రాయ ముంది. కాని ఈ నియమం భారతదేశానికి అన్వయించడానికి వీలుకాదు. ఎందుకంటే భారతదేశంలో 5000 కంటే జనాభా మీరిన అనేక గిరిజన వర్గాలు ఉన్నాయి. వాటిలో బంజారా కూడా ఒకటి.



## గిరిజనులు – అధ్యయన క్రమం

గిరిజనులను గూర్చి అధ్యయనం రెండు విధాలుగా జరిగింది.

1. ప్రతియొక్క గిరిజన సంస్కృతి తెలుసుకొనేందుకు చేసే అధ్యయనం.
2. మొత్తంమీద మానవ సంస్కృతి స్వరూపమేమి? అని తెలుసుకొనేందుకు చేసే అధ్యయనం.

భారతదేశంలో వేదకాలం నుండి మార్పు పొందిన (అస్తిత్వంలో ఉండే) వర్ణ వ్యవస్థతో బాటు, మార్పు పొందని వర్ణాలకు చెందిన వారి నుంచి ప్రత్యేకంగా కొండలలో, అడవులలో నివసించే గిరిజన వర్గాలు చాలా ఉన్నాయి. ఈ గిరిజనులు తమ విశిష్ట సంస్కృతి యొక్క అంశాలైన నమ్మకాలు. సంప్రదాయాలు, సాహిత్యం, సంగీతం, నృత్యం, కళ, హస్త కళ మొదలైన పలు అంశాలనుండి భారతదేశ సంస్కృతిని అభివృద్ధి చేసింది. కాని శిష్టవర్గం భారతీయ సంస్కృతిని గురించి మాట్లాడుతున్నప్పుడు నాలుగు వర్గాలను మాత్రమే తమ మనస్సులో ఉంచుకొని గిరిజనుల సంస్కృతిని చిన్నచూపు చూసినట్లు కనిపిస్తుంది. బ్రిటిష్ ప్రభుత్వకాలంలోను, స్వాతంత్ర్యానంతరం ఈ గిరిజనుల సంస్కృతి అధ్యయనానికి ప్రాధాన్య మివ్వబడింది. భారతదేశంలో గిరిజనులు చాలా ఎక్కువ సంఖ్యలో ఉండే రాష్ట్రాలంటే. మధ్యప్రదేశ్, ఒరిస్సా మరియు అస్సాం అని చెప్పవచ్చు. మిగతా రాష్ట్రాలలో కూడా గిరిజనులు గణనీయ సంఖ్యలో ఉన్నారు. ఈ గిరిజనులు వేరువేరు జాతులకు (Race) చెందినవారై వేరువేరు భాషలను మాట్లాడుతారు. భౌగోళిక మరియు సాంస్కృతిక ఆధారాల మీద భారత దేశంలో ఉండే గిరిజనులను మూడు వలయాలుగా విభాగిస్తారు. 1. దక్షిణ వలయం (Southern Zone) 2. మధ్యవలయం (Central Zone) 3. ఈశాన్యవలయం (North-East Zone).

బంజారాల మూలస్థానంగా భావింపబడే మధ్యవలయానికి చెందిన రాజస్థాన్ ప్రాంతం నుండి దక్షిణవలయానికి విశేషంగా వలసవచ్చి ఉంటారని చాలామంది విజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

## గిరిజనులు హిందూధర్మంలో కలసిపోతారా ?

భారతదేశపు పలు సమస్యలలో గిరిజనుల సమస్యకూడా ఒకటి. ఈ గిరిజనులు తమసంస్కృతిని తామే కాపాడుకొంటూ తమ ప్రత్యేకతను నిలుపుకొంటూ ముందుకు సాగిపోవాలా? లేక ఇతర ప్రజలతో కలసి హిందూధర్మంలో లీనం కావాలా? అన్నది సమస్యగా తయారయింది. దీన్ని గురించి మానవ విజ్ఞాన శాస్త్రవేత్తలలోనే భిన్నాభిప్రాయాలున్నాయి. ఉదాహరణానికి "వెరియర్ ఎల్విన్" గారు గిరిజనులు తమ సంస్కృతిని తామే కాపాడుకోవడం మాత్రమేగాకుండా దాన్ని ప్రత్యేకంగానే అభివృద్ధి చేయాలని అభిప్రాయపడ్డారు. ఎవరు ఏమన్నా కాలచక్రం తిరిగినట్లు నాగరికత ప్రభావంతో గిరిజనులు తమ సంస్కృతి మూల స్వరూపాన్ని కోల్పోతూ ఇతరులతో కలసిపోవడం అనివార్యం. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత భారతప్రభుత్వం ఈ గిరిజనులపట్ల శక్యనీతిని ప్రదర్శించింది. ఈశాన్య వలయ "నాగా" మొదలైన గిరిజనులు తమ సంస్కృతిని తామే ప్రత్యేకంగా కాపాడుకోవాలని ప్రయత్నించడంవల్ల ఆ వలయాన్ని 'పరిశిష్ట ప్రదేశ'మని (Scheduled area) నిర్ణయించి, ఆవలయానికి ఎక్కువ స్వాతంత్ర్యాన్నిచ్చి అక్కడి ప్రజలకు విశేషమైన కొన్ని సౌకర్యాలను కలుగజేసింది. దక్షిణ మరియు మధ్యవలయాల గిరిజనుల సంస్కృతి చాలావరకు హిందూ ధర్మంలో లీనమైనందువల్ల వారికి ఈ సౌకర్యాలు లభించలేదు. కాని భారత ప్రభుత్వం 1950 సంవత్సరంలో దాదాపు 571 గిరిజన తెగలను "పరిశిష్ట గిరిజను"లని (Scheduled tribes) నిర్ణయించి ఆవర్గాల వారికి విద్యాభ్యాసం, రాజకీయాలో మరియు ఉద్యోగాలలో విశేష సదుపాయాలను కల్పించింది. ఈ పరశిష్ట గిరిజన వర్గానికి చెందిన కొన్ని గిరిజన వర్గాలు ఒకే ప్రాంతంలో నివసిస్తుంటారు. మరికొన్ని గిరిజన వర్గాలు నిరంతరం సంచారం చేస్తుంటారు. స్థిరనివాసంగల గిరిజనులను 'Nomadic tribes' అని. సంచార గిరిజనులను 'Semi nomadic tribes' అని ప్రభుత్వం గుర్తించింది. భారత ప్రభుత్వంచేసిన ఈ పరిశిష్ట గిరిజనుల వర్గీకరణంలో వైజ్ఞానిక దృష్టికంటే రాజకీయ దృష్టియే ఎక్కువ ఉందని విజ్ఞుల అభిప్రాయం.

## మన అభిప్రాయం మారాలి

గిరిజనులు, ఆదివాసులు అనగానే మనలో చాలామందికి ఒక దురభిప్రాయం తలెత్తుతుంది. వారేదో చెట్లు పుట్టలు పట్టుకు తిరుగుతారని ఆకులు, అలములు తింటూ అడవులలో, కొండలలో అనాగరికంగా జీవనం సాగిస్తుంటారని అనుకుంటాం. అంతటితో కూడ ఆగక, వారికి సభ్యత, సంస్కారాలు లేవని, సంగీత సాహిత్యాల గురించి తెలియదని, సంస్కృతి అనేమాట స్పర్శే వారికి లేదని అనుకుంటాం. అందువల్ల వారి గురించి ఆలోచించేదేమిటని కూడా అంటాం, భావిస్తాం.

ప్రొఫెసర్ నిర్మల్ సేన్‌గుప్తా గారు గిరిజనులపై మన ఆలోచన మారాలి" అన్న వ్యాసంలో ఈవిధంగా చెప్పారు.13 "ఇది వారి వెనుక బాటుదనం ఫలితం కాదు, మన ఆలోచనల వెనుకబాటుదనం దుష్ఫలితమని అంటున్నారు. ఏదేశంలోనైనా అడవితల్లిని నమ్ముకొన్న బడుగుజీవులను చిన్నచూపు చూడవద్దని, "అడవితల్లికి కోటిదండాలో" అని గొంతెత్తి పాడుకునే గిరిజనులకు సంగీత సాహిత్యాలు లేవనీ, వారిని తక్కువగా అంచనా వేయవద్దని, గిరిజనులు కూడా మనందరివంటి వారేనని, సంస్కార వంతులుగా మనం వారికి చూపగలిగే సంఘీభావం ఏదైనా ఉంటే అది వారిని కూడా ఈ దేశంలో ఒక భాగంగా చూడడం మాత్రమే"నని ఆయన అంటారు. కాని మధ్య తరగతి ప్రజానీకం మాత్రం తామే గిరిజనులకన్న గొప్ప వారిమని భ్రమపడుతూ, గిరిజనులను అమాయకులుగా చూస్తుంటారు. ఈ ఆలోచన సరికాదని ప్రొఫెసర్ నిర్మల్ సేన్ గుప్తాగారి అభిప్రాయం.

ప్రొఫెసర్ నిర్మల్ సేన్ గుప్తా ఆంధ్రప్రదేశ్, గుజరాత్ ఈశాన్య రాష్ట్రాల గిరిజనోద్యమాల గురించి ప్రతిష్ఠాకరమైన ఆంగ్ల వారపత్రిక "ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లి"లో అనేక వ్యాసాలు వ్రాశారు. ఆయన ఆంధ్రప్రదేశ్‌లో గిరిజనుల సంస్కృతిని ప్రస్తావిస్తూ, కోస్తా, రాయలసీమ సంస్కృతులకంటే తెలంగాణా సంస్కృతి బాగా భిన్నమైందని, తెలంగాణా సంస్కృతిని మళ్లీ అధ్యయనం చేస్తే హైదరాబాదు నుంచి చూసినప్పుడు మాత్రం పెద్దగా తేడా కనిపించక పోవచ్చునుగాని, వరంగల్, ఖమ్మం

నుంచి చూస్తే మాత్రం ఆ లోలోపలే సంస్కృతిలో ఎంతో వైవిధ్యం కన్పిస్తుందని చెప్పారు. ఆంధ్రప్రదేశ్ గిరిజనులు ఎక్కువగా ఉత్తర సరిహద్దులలో ఉన్నారు. ఆప్రాంతం పరిస్థితులు వేరు. అందుకే అక్కడి ప్రజల సమస్యలు వేరే అని అర్థం చేసుకోవాలి అని ఆయన అన్నారు.

"పోడు" వ్యవసాయంపై ఈమధ్య ఎన్నో వాదోప వాదాలు వినవస్తున్నాయి. ఈ పద్ధతి వల్ల ఎన్నోనష్టాలు సంభవిస్తున్నట్లు ప్రభుత్వం చెబుతోందిగాని నిజానికి కొండ ప్రాంతాలకు ఇది చాలా మంచిదని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మైదాన ప్రాంతాలకు ఏది మంచిదో అన్నిటికీ అదే మంచిదనే ప్రచారం జరుగుతున్నదని ప్రొఫెసర్ నిర్మల్ సేన్ గుప్తా ఆక్షేపించారు. గిరిజనులు కాదంటే మాత్రం వీరు అనాగరిక వెధవలు, వీళ్లకు చెప్పి కూడా లాభం లేదు. మెడపట్టి బయటకు గెంటివేయండి అని ఒక్కసారిగా విరుచుకు పడతాం.

గిరిజనులు పోడు వ్యవసాయం చేస్తున్నారని గగ్గోలు పెడతాం కానీ, రెండురకాలు తెలిసికూడా వారు 'పోడు' వ్యవసాయం మీదే ఎందుకు ఆధారపడుతున్నారో తెలుసుకోవడానికి ఏ ఒక్కరూ ప్రయత్నించడం లేదు. పదివేల సంవత్సరాల నుంచి ఇక్కడి గిరిజనులకు వరిసాగు విధానం తెలిస్తే వారెందుకు అభివృద్ధి కాలేదు? మిగిలిన కులాల వారు ఏవిధంగా అభివృద్ధి చెందారు? ఏది ఏమైతేనేం మొత్తం మీద పురామానవ శాస్త్రజ్ఞులలో ఒక అసంతృప్తి వర్గం మాత్రం ఈ 6, 7 ఏండ్లలో బయలు దేరిన పోడు వ్యవసాయమే గిరిజనులకు గాని, అభూములకుగాని మంచిదని చెబుతారు" అని ప్రొఫెసర్ నిర్మల్ సేన్ గుప్తా వివరించారు.

ఆంధ్రప్రదేశ్‌లోని గిరిజనులలో కూడా మధ్య తరగతి వారు ఉన్నారు. వారి ఆశలు, ఆకాంక్షలు వారివి. ఆంధ్రప్రదేశ్‌లో ఈ తేడా పెద్దగా కనిపించక పోవచ్చుగాని, ఈశాన్య రాష్ట్రాలలో ఈతేడాను బాగా గుర్తించవచ్చు. అందువల్ల ఈ సమస్యను మధ్యతరగతి కోణం నుంచి గాక మైదాన ప్రాంతాల కొండ ప్రాంతాల ప్రజల మధ్యగల అంతరంగా

గుర్తించాలి. మైదాన ప్రాంతాల నుంచి కొండ ప్రాంతాలపైకి, అడవి ప్రాంతాలపైకి పోటీపడి ఎగపడడానికి గల ఏకైక బలమైన కారణం అక్కడ గల అపారమైన సంపదే గాబోలు. ఈసంగతి అలా ఉంచితే అన్ని చోట్ల ఒకే రకం మధ్యతరగతి ఉన్నదనే భ్రమ ఒకటి.

ఈమధ్య ప్రచారవిలువ సంతరించుకొన్నది. ఇది చాలా ప్రమాద కరమైన ధోరణి. ఇప్పటికే మధ్యతరగతి పరాయీకరణ పాలైంది. పైగా వారికి జరుగుతున్న అన్యాయంలో కంట్రాక్టులద్వారానో, ఉపాధి అవకాశాల ద్వారానో మధ్యతరగతి కూడా కొంతలబ్ది పొందే పరిస్థితులు వచ్చేశాయి. కాని సరిగా అవగాహన చేసుకొంటే మాత్రం మధ్యతరగతి సైతం గిరిజనుల పక్షాన నిలిచే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. ఈదేశంలో ఏదో ఒకనాడు ఝార్ఖండ్ ఉద్యమంతో సహా అన్నిటికీ మధ్యతరగతి మద్దతు లభించవచ్చు. కాని అన్యాయానికి గురవుతున్న ఆదివాసులు గాని, గిరిజనులు గాని ఆముహూర్తం వచ్చేవరకు ఎదురు చూస్తూ కూర్చోరు.

## గిరిజన స్త్రీల ఇబ్బందులు

నేటి సమాజంలో పెత్తందారి విధానం గిరిజనులపై ఎక్కువ అవడంవల్ల మొదట గిరిజన సమాజం, ఆ తర్వాత గిరిజన కుటుంబం, చివరికి గిరిజన స్త్రీ చాలా స్వాతంత్ర్యాలను కోల్పోయిందనిపిస్తుంది. గ్రామీణ గిరిజన ప్రాంతాలలోని స్త్రీల పరిస్థితుల గురించి చర్చ సరిగా జరగటంలేదనే చెప్పాలి.

పూర్వకాలంలో గిరిజనస్త్రీకి సామాజిక. ఆర్థికస్థాయి ఎలాఉండేది? దానిలో వచ్చిన మార్పులు. ప్రస్తుత పరిస్థితి మొదలైన విషయాలను తెలుసుకోవడం ఎంతైనా అవసరం. గత 40 సంవత్సరాలుగా గిరిజన ప్రాంతాలలో చాలా మార్పులు వచ్చాయి. గ్రామీణ ప్రాంతంలో నివసించే జనాభాలో షెడ్యూలు జాతులు, తెగలకు చెందినవారి ఆర్థికపరిస్థితి

మిగిలిన వారికంటే చాలా వెనుకబడి ఉంది. దీనికి కారణం అక్షరాస్యత తక్కువగా ఉండటం. షెడ్యూలు జాతులలో అక్షరాస్యులు నూటికి 21 మంది ఉండగా, షెడ్యూలు తెగలలో నూటికి 16 మంది మాత్రమే ఉన్నారు.

మనదేశంలో సుమారు వంద సంవత్సరాల క్రితం వరకు కొండ, అడవి ప్రాంతాలలో గిరిజనులు ఉండేవారు. కాని తర్వాత కాలంలో కొంతమంది సంచార వ్యాపారులు, మధ్యదళారీలు ప్రవేశించినారు. వారు గిరిజన అవసరాలను ఆధారంగా చేసుకొని డబ్బులు, విత్తనాలు, ఉప్పు, మెరపకాయలు, బట్టలు మొదలైనవి వడ్డీకి అప్పులిచ్చేవారు. ఆర్థిక ఇబ్బందులవల్ల గిరిజనులు వడ్డీలనే తీర్చలేక పోయారు. అందువల్ల వడ్డీకి వడ్డీ కలిసి, అసలు మొత్తం తీర్చలేక, చివరికి ఆస్తులను వ్యాపారుల స్వాధీనం చేసేవారు.

ప్రభుత్వం గిరిజన ప్రాంతాలలో ప్రయాణ సౌకర్యాలు, పాఠశాలలు, వైద్య, మంచినీటి సౌకర్యం కూడా సమకూర్చడంతో వచ్చిపోయే వ్యాపారులు కూడ గిరిజన ప్రాంతాలలో స్థిరపడటం మొదలు పెట్టడంతో గిరిజనులపై దోపిడి ఎక్కువైంది.

గిరిజనులలో విద్యవల్ల అజ్ఞానంతగ్గి విచక్షణాశక్తి పెరగడంతో వారి ప్రవర్తనలో మార్పు వచ్చింది. కాని నేడు కొంతమంది విద్యావంతులైన యువకులు మాత్రం దీనికి భిన్నంగా ప్రవర్తించడం కనిపిస్తూంది. ముఖ్యంగా ఉద్యోగం చేస్తున్న గిరిజన యువకులు కట్నాలు పుచ్చుకోవడం మొదలుపెట్టారు. గిరిజనులలో పూర్వం 'ఓలి' కట్టి భార్యను తెచ్చుకొనేవారు. నేడు వరకట్నం అడుగుతున్నారు. దీనికి ప్రధానకారణం యువకులు తమ దృక్పథాన్ని మార్చుకోవడం. ఈ మార్పువల్ల గిరిజన స్త్రీ స్వాతంత్ర్యాన్ని కోల్పోతుంది. పూర్వం గిరిజన స్త్రీ వివాహం సమస్యకాదు. అనాడు వ్యవహారంలో ఉన్న ఏదో ఒక పద్ధతి ద్వారా వివాహం జరిగేది. కాని నేడు వరకట్నం ఇవ్వలేని విద్యావంతులైన గిరిజన స్త్రీలు చాలా మంది కన్పిస్తున్నారు.

గిరిజనులు చెమటోడ్చి కష్టపడినా ఆహారం లభించడం దుర్లభమైంది. ఒకవేళ ఏరోజైన ఆరోగ్యం బాగా లేకపోతే ఆరోజు ఆహార సేకరణ ఉండనందున వారు పస్తు ఉండవలసి వస్తుంది. దీనివల్ల గిరిజన స్త్రీ పురుషులు ఇద్దరు ఇబ్బంది పడవలసి ఉంది.

గ్రామీణ గిరిజన ప్రాంతాలలో నీటివసతి తక్కువైనందున గిరిజనస్త్రీ నీటికోసం మైళ్లదూరం పోవలసి వస్తుంది. నీరు సరిగా దొరకనందున కలుషితం అయిన నీళ్ల త్రాగి పిల్లలు జబ్బుచేసి చనిపోతున్నారు. దీనివల్ల కూడా గిరిజన స్త్రీ సంతానాన్ని పోగొట్టుకొని దుఃఖపడతుంది, దుఃఖపడవలసివస్తూంది.

గిరిజనుల సంప్రదాయం ప్రకారం గిరిజన స్త్రీలు పిల్లలకు, భర్తకు ఆహారం పెట్టిన తరువాత మిగిలిన దానినే తింటారు. ఒక్కొక్కప్పుడు ఆహారం మిగలక పస్తుంటారు. దీనివల్ల వారి ఆరోగ్యం పూర్తిగా దెబ్బ తింటూంది.

సాధారణంగా గిరిజనస్త్రీకి ఎనిమిది సంవత్సరాల వయస్సు నుంచే కష్టాలు ప్రారంభమైతాయి. గ్రామీణ ప్రాంతాలలో నివసించే గిరిజన స్త్రీలు మేకలు కాయటం, పంట పొలాల దగ్గర కాపలా ఉండటం, సున్నం, కట్టెలు అమ్మడం మొదలైన పనులు చేస్తారు. పెండ్లి అయిన తర్వాత పిల్లలను సాకడం, కుటుంబ భారం మోయడం మొదలవుతుంది.

నేడు గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్న హరిజన, గిరిజన స్త్రీలపై అత్యాచారాలు, మానభంగాలు ఎక్కువైనాయి. ఈమధ్యనే వారిపై రాజకీయమైన దోపిడి మొదలైంది. ఈవిధంగా హరిజన, గిరిజన స్త్రీల మానంపై రాజకీయం సాగించడం చాలా విషాదకరం, విచారకరం. గిరిజన స్త్రీలపై అత్యాచారం జరిగినా, జరగకపోయినా, రాజకీయంగా వచ్చే లాభం కోసం ఈవిధమైన తప్పుడు ప్రచారం చేస్తూ, వారి మానాలను మంటగలుపుతున్నారు. కాబట్టి విద్యావంతులైన గిరిజన యువతీ యువకులు తమజాతిని అభివృద్ధి చేయడానికై వయోజన విద్యను ప్రోత్సహించి, నిరక్ష

రాస్యతను పోగొట్టాలి. అప్పుడే గిరిజనులు తమంటతామే వారి కాళ్ళమీద నిలబడగల్గుతారు. ప్రభుత్వం ఒకవైపు "గిరిజన స్త్రీ శిశు సంక్షేమం" కోసం యుద్ధప్రాతిపదిక మీద చేపట్టవలసిన బృహత్తర కార్యకలాపాలను రూపొందిస్తున్నా, మరొకవైపు స్త్రీని పూజించే చోట దేవతలు నివసిస్తారని మన పెద్దలు చెప్పుతున్నారు. కాని దురదృష్టవశాత్తు నేటి గిరిజన పురుషులు స్త్రీని అత్యున్నత స్థానంలో వుంచి పూజించకపోయినా కనీసం తనతో సమానమైన వ్యక్తిగా కూడా చూడలేక పోతున్నారు.

నేడు సమాజంలో వికటాట్టహాసం చేస్తున్న వరకట్న పిశాచమే ఇందుకు ప్రబల నిదర్శనం. ప్రతి గిరిజన యువతీ యువకుడు ఈ ఆచారాన్ని క్రూరంగా వెలివెయ్యాలి అంతేగాకుండా ప్రతి యువకుడు వరకట్నం అనే ముష్టికోసం ఆశపడకుండా తమ స్వశక్తిపైనే ఆధారపడి అభివృద్ధిలోనికి రావాలి. ప్రతి స్త్రీ కూడా వరకట్నం ఆశించే వెన్నెముకలేని యువకుడ్ని భర్తగా స్వీకరించడానికి ఇష్టపడకూడదు. ప్రతి తల్లి, తండ్రీ, సోదరుడూ ఈ సదాశయానికి చేయూతనివ్వాలి. అట్టడగు సమాజం నుండి పైస్థాయి వరకూ స్త్రీ జీవితం ఇంత దయనీయంగా వుండేందుకు కారణం ఏమిటి? అని ఆలోచించాలి. బహుశా స్త్రీకి ఆస్తి హక్కు లేకపోవడమే దీనికి కారణమని పిస్తుంది. ప్రతిస్త్రీకి తండ్రి ఆస్తిలో తప్పనిసరిగా హక్కు వుండాలి. అప్పుడే స్త్రీల పరిస్థితి ఆర్థికంగా మెరుగుపడుతుంది.

గిరిజన పురుష ప్రపంచం స్త్రీని బాల్యంలో తల్లిదండ్రులపైనా. యవ్వనంలో భర్తపైనా, వృద్ధాప్యంలో కుమారుని పైనా ఆధారపడి జీవించమని శాసించింది.

మరి గిరిజన స్త్రీకి స్వేచ్ఛ ఎక్కడ? ఎప్పుడు? అని విజ్ఞులు ఆలోచించాలి. అప్పుడే స్త్రీల సమస్యకు పరిష్కార మార్గం, స్త్రీలకు స్వాతంత్ర్యం లభిస్తుందని భావింపవచ్చు.



## వివాహ వ్యవస్థలో మార్పులు

సామాన్య ప్రజానీకానికి గిరిజనులు అంటేవారు కొండ, అడవి ప్రాంతాలలో నివసించేవారని, వారు తలలో ఈకలు పెట్టుకొని ఎప్పుడూ గంతులు వేస్తుంటారనే అభిప్రాయం చాలా మందిలో ఉంది.

గిరిజనులు అనే పేరులోనే కొండ ప్రాంతాలలో నివసించేవారను అర్థం ఉంది. అయితే ఈ కొండ ప్రాంతాలలోని ప్రజలకు కొన్ని దశాబ్దాల క్రితం వరకు బయటి ప్రపంచంలో సంబంధాలు పెద్దవిగా ఉండేవి కావు. ప్రకృతిలో సాహచర్యంవల్ల, ప్రకృతిపై వారి జీవనం ఆధారపడి ఉండడం వల్ల ఒక ప్రత్యేకమైన సంస్కృతిని, జీవన విధానాన్ని వారు అలవరచు కున్నారు.

"గిరిజన వివాహానికి సామాజిక మతపరమైన అనుమతి ఉంటుంది. స్త్రీ పురుషులిరువురూ సన్నిహితులై తత్ఫలితంగారాగల సామాజిక, ఆర్థిక సంబంధాలకు అనుమతి లభిస్తుంది. వివాహం వల్ల జీవన మానసిక తృప్తి కలుగుతుంది. సమాజంలోని ప్రాథమిక స్థాయిలో శ్రమవిభజన, సహకారం సుస్థిరంగా సాగిపోవడానికి, వివాహం ఒక సూచన" అని చెప్పబడింది.14

గిరిజలులలో పలురకాలైన వివాహాలు అమలులో ఉన్నాయి. వాటిని గూర్చి సంగ్రహంగా తెలుసుకొందాం.

1. సంప్రదింపుల ద్వారా వివాహాలు :— ఈ వివాహ పద్ధతిలో తల్లి దండ్రులే తమపిల్లలకు సంప్రదింపుల ద్వారా వివాహ సంబంధాలు చూస్తారు.

2. పరస్పర అంగీకారంతో వివాహం :— యువతీ యువకులు తల్లి దండ్రుల కిష్టం లేకపోయినా పరస్పం అంగీకారంతో వివాహం చేసుకొంటారు.

3. <u>పారిపోయి వివాహం చేసుకోనుట :—</u> యువతీ యువకులు తల్లి దండ్రుల నుండి దూరంగా పారిపోయి వారియిష్టప్రకారం పెండ్లి చేసుకొంటారు.

4. <u>మార్పిడితో పెళ్లి :—</u> కన్యాశుల్కం చెల్లించలేనప్పుడు రెండు కుటుంబాల వధువులను ఇచ్చిపుచ్చుకోవడం ద్వారా మార్పిడి చేసు కొంటారు.

5. యువతి తాను ప్రేమించిన యువకుని ఆకర్షించలేనప్పుడు అతడి కుటుంబంలోకి ప్రవేశించి యువకుని తల్లిదండ్రులకు బహుమతులనిచ్చి వారిమన్నన పొంది పెండ్లిచేసుకొంటుంది.

6. కన్యాశుల్కం ఇవ్వలేని యువకుడు అత్తమామ గారింటి వద్ద పెళ్లి అయ్యే వరకు వారికి సేవలుచేసి పెండ్లి చేసుకొంటాడు

7. <u>కైశ్వసంతో వివాహం :—</u> యువతీ యువకులు ఇష్టపడినప్పుడు యువకుడు సమయం చూసుకొని తన స్నేహితుల సహాయంతో యువతిని తీసికెళ్లి వివాహమాడుతాడు.

పైన తెల్పిన గిరిజనుల వివాహ పద్ధతులను, వ్యవస్థను పరిశీలిస్తే మనకు రెండు విషయాలు ప్రధానంగా గోచరిస్తాయి.

1. సమాజంలో కొన్ని సందర్భాలను మినహాయించి స్త్రీకి స్వాతంత్ర్యం ఉంది.

2. ఇప్పటికీ వారిలో ప్రాచీన వివాహ సంప్రదాయాలు అమలులో ఉండటం,

ఇటీవల గిరిజనులు మనతో సంబంధాలు పెంచుకున్న తర్వాత మాత్రం మన జాడ్యాలను కొన్నింటిని అంటించుకున్నారు. నేడు వారిలో కూడా అసంతృప్తి పోకడలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

గిరిజన యువకునకు ఒక యువతి నచ్చిందంటే ఆమెను గురించి పెద్దలనుంచిగాని, స్నేహితుల ద్వారా గాని తెలుసుకుకటాడు. అవసరమైతే స్నేహితుల సహాయంతో అడవినుంచి గాని, సంత నుంచి గాని ఆమె వచ్చేదారి కాస్తాడు. దీనినే పడిగాపులు కాయడమంటారు. సమయంచూచి ఆమెను బలవంతంగా ఎత్తుకుపోయి అబ్బాయి గ్రామానికి గాని అతని దగ్గర బంధువుల గ్రామానికి గాని తీసుకొనిపోయి బలవంతంగా పెండ్లి చేసుకుంటాడు. ఈ విషయం ఇరువైపుల పెద్దలకు తెలియగా, వారు సమావేశమై చర్చిస్తారు. పెండ్లి ఎలాగో అయిపోయింది. కాబట్టి వాళ్లు కూడా అంగీకరించి, అబ్బాయికి తప్పు వేస్తారు. అబ్బాయి వా తమ జాతి పెద్దలకు, చుట్టాలకు భోజనాలు పెట్టించి, పెద్దలు నిర్ణయించిన తప్పును కడతారు. ఈ విధమైన పెండ్లి గిరిజన జాతులలో చాలా వాటిల్లో ఉంది. దీనినే మనం నేడు "రాక్షస వివాహం" అంటాం.

గిరిజన యువతీ యువకులు పరస్పరం ప్రేమించుకొని ఒక పథకం ప్రకారం ఇరువురు సమ్మతిపడి పారిపోయే పద్ధతి కూడా అమలులో ఉంది. ఇది పైన తెల్పిన రాక్షస వివాహం కంటే కొంచెం సౌమ్యంగా జరుగుతుంది. పారిపోయిన ఈజంటను దగ్గర బంధువులు చేరదీసి ఆశ్రయమిస్తారు. ఈ విషయం అమ్మాయి తల్లిదండ్రులకు తెలియగానే కులపెద్దల వద్ద పంచాయతీ పెట్టించి, అబ్బాయికి తప్పు వేయిస్తారు. అబ్బాయి కుల పెద్దలు వేసిన తప్పును కట్టి పిల్లను తన యింటికి తీసుకొనిపోయి పెద్దల అంగీకారంతో పెండ్లి చేసుకుంటాడు.

సాధారణంగా గిరిజనులలో పెద్ద మనుష్యులు సంబంధం కుదర్చగా అబ్బాయి ప్రక్కవారు 'ఓలి' కట్టి పెండ్లి చేసుకుంటాడు. ఈ ఓలి కొన్ని ప్రాంతాలలో కేవలం డబ్బు రూపంలో ఉంటే, మరికొన్ని ప్రాంతాలలో డబ్బు, పశుసంపద మొదలైన రూపంలో ఉంటుంది. ఈ ఓలి వారి వారి ఆర్థికస్థితిగతులపై, స్నేహసంబంధం, బంధువర్గం మొదలైన వాటి మీద ఆధారపడి ఉంటుంది. ఆనాడు ఓలి ఇవ్వలేక పెండ్లికాని యువకులు కూడ ఉండేవారట. గిరిజనులలో ఆనాడు ఇల్లరికం కూడా ప్రచారంలో ఉండేది. అమ్మాయి తల్లిదండ్రులకు మగపిల్లలు లేకపోతే, ఆ కుటుంబ ఆస్తిని కాపాడటానికై ఎవరినైనా మగపిల్లవానిని ఇల్లరికం తెచ్చుకుంటారు.

ఇల్లరికం వచ్చిన అబ్బాయి ఆ ఇంటి యజమాని చెప్పినట్లు నడచుకోవాలి. ఒకవేళ అబ్బాయి ప్రవర్తన నచ్చకపోతే వెనుకకు పంపుతారు, అబ్బాయి ప్రవర్తన నచ్చితే తన కూతురునిచ్చి పెండ్లిచేస్తాడు.

గిరిజనులలో పెండ్లి అయిన తరువాత కూడ ఇష్టంలేని యెడల భర్తతో భార్య కాపురం చేయవలసిన అవసరంలేదు. ఆమె తనకు ఇష్టం ఉన్న వానితో వెళ్లిపోవచ్చు. అట్లు ఆమెవేరే వానితో వెళ్లిపోతే కొత్త భర్త తప్పుకట్టాలి. ముందు చేసుకొన్న భర్త పెండ్లికి ఖర్చుపెట్టిన ఓలి మొత్తాన్ని కొత్త భర్త ఇచ్చివేయాలి. వీరిలో ఇష్టంలేని భర్తతో బలవంతంగా కాపురం చేయడం మాత్రం లేదు.

పూర్వం గిరిజనులు ఆడపిల్లలకు ఓలికట్టి పెండ్లి చేసుకొనేవారు. కాని నేడు ఆపరిస్థితి పూర్తిగా తారుమారైంది. విద్యావంతులైన యువకులు నేడు వరకట్నం తీసుకుంటున్నారు. వరకట్నం ఇవ్వలేక పెండ్లిండ్లు కాని ఆడపిల్లలు నేడు ఎందరో ఉన్నారు. ప్రస్తుతం గిరిజన వివాహ వ్యవస్థ "ఓలి నుంచి వరకట్నం" వరకు పాకింది. దీనికి కారణం నేటి సమాజంలో కాలానుగుణంగా వస్తున్న మార్పులు, విద్యావంతులైన యువకులు వర కట్నాలపై ఆశపడడం, యువకులు తమ దృక్పథాన్ని మార్చుకోవడమని భావించవచ్చును.

---

## ఆంధ్రప్రదేశ్‌లోని బంజారాల ప్రస్తుత పరిస్థితులు

ఆంధ్రప్రదేశ్‌లో ఎన్ని బంజారాల సంఘాలు స్థాపించినా, ఎన్ని సభలు నిర్వహించి తీర్మానాలనుచేసి ప్రభుత్వానికి సమర్పించినా. ప్రభుత్వం నుండి ఎన్ని వాగ్దానాలు తీసుకున్నా, వాళ్ల స్థితిగతులు మాత్రం ఇప్పటికినీ విషాదంగానే ఉంటున్నాయి. కట్టడానికి బట్ట, తినడానికి తిండి, ఉండడానికి ఇండ్లు లేక అనేకులు తమ తాండాలను, గూడెములను వదలిపెట్టి సుదూర ప్రాంతాలకు జీవనోపాధికి వెళ్ళుట తప్పుటలేదు, వెళ్ళుతున్నారు. తమకున్న వస్తువాహన సంపదలను బుట్టల్లో సర్దుకొని. నెత్తి. భుజాలపై పెట్టుకొని

గ్రామాలవెంట సంచారయాత్ర సాగిస్తూన్నారు. కేవలం ఒక్కపూటనే అర్థ తిండిచే (చాలిచాలని తిండితో) బ్రతుకు జీవుడాయని తమ జీవితాన్ని కొన సాగిస్తున్నవారు లెక్క లేకుండా ఉన్నారు.

బంజారాలలో అత్యధికులు వ్యవసాయం, పశువుల పెంపకం, తాళ్లు అల్లడం, గోనె సంచులు తయారు చేయడం, కట్టెలమ్ముకోవడం, సున్నపు బట్టీలు కాల్చి అమ్ముకోవడం, గోడ పనులకు మట్టి మోయడం, కర్మాగారాలలో కూలీలుగా పనిచేయడం మొదలైన పనులను చేసుకొంటు న్నారు. వారికి ప్రభుత్వం చేపట్టే అభివృద్ధి పథకాలను గురించికాని, స్వచ్ఛంధ సంస్థ సహాయ కార్యక్రమాలను గురించిగాని తెలియవు. దానికి కారణం వారి పిల్లలలో విద్యాలోపం, బయట ప్రపంచం గురించి తెలియ కుండుట. ఈ రెండును సంఘం ద్వారాగాని, ప్రభుత్వం ద్వారాగాని ఎంత చురుకుగా జరిపిస్తే జాతి అంత అభివృద్ధికి రాగలదు.

నేడు సంఘంలో జాతిపిత బాపూజీ గాంధీమహాత్ముని కృషివల్ల హరిజనులు విద్యావంతులై ఆర్థికంగా, రాజకీయంగా, ప్రభుత్వంలో ఉన్నత స్థానాలను సంపాదించుకొని స్వజాతి సంక్షేమం కొరకు పాటుపడుతున్నారు. అదేవిధంగా పూజ్య ధక్కర్ బాపూజీ సేవాఫలితంగా మారుమూల ఆటవీ ప్రాంతాలలో నివసిస్తున్న ఆదివాసులను మానవులుగా పరిగణించి వారికి విద్యావసతి గృహాలు స్థాపింపబడినాయి. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు, వెన్నెలకంటి రాఘవయ్య పంతులు, మొదలైన పెద్దల అమూల్యా మైన సేవలచేత సుగాలి, ఎరుకుల, యానాదులను తరతరాలుగా జైళ్ళలో క్రుంగిస్తున్న అమానుష్యమైన సి.టి. యాక్టు 1947 వ సంవత్సరంలో రద్దు చేయబడింది. వారి సిఫారసుల మేరకు, సుగాలి, ఎరుకుల, యానాదుల సంఘాల ఆందోళన ఫలితంగా 1956 వ సంవత్సరం నాటికి ఆంధ్ర ప్రాంతములోని వెనుకబడిన జాతుల జాబితానుంచి తీసివేసి, వారిని షెడ్యూల్డు జాతుల కోవలో చేర్చడం జరిగింది. ఆతర్వాత ఆంధ్రప్రదేశ్‌లోని బంజారా సంఘాల ఆందోళనలవల్ల ఏరియా రిస్ట్రిక్షన్ (ప్రదేశ పరిమితిని) తీసివేసి తెలంగాణాలోని బంజారా, ఎరుకుల, యానాదులను కూడా 1976 వ సంవత్సరం నుండి షెడ్యూల్డు జాతులుగా పరిగణించడం జరిగింది.

# మూడవ అధ్యాయం



## బంజారా పాటలు — కథలు

### బంజారాల పాటలు

బంజారాలు సమాజంలో అక్షరజ్ఞానం లేక గ్రామాలకు దూరంగా ఉండే తాండాలలో నివసించే సామాన్యులు. వారు అప్రయత్నంగా అలవోకగా సహజధోరణిలో పాటలను ఆశువుగా అల్లుకు పోతుంటారు. నిరక్షరాస్యులైన ఈ బంజారాలు కూడా వారి భాషలో భక్తిపాటలు, పండగ పాటలు, ఉయ్యాల పాటలు, జోల పాటలు, నృత్యం పాటలు, శ్రామిక గేయాలు (నాట్ల, కోత, తిరుగలి పాటలు), పెండ్లి సమయంలో పాడే పలురకాల పాటలు, ప్రేమపాటలు, బుజ్జగింపు పాటలు, జాతర (దేవర) సమయంలో పాడే పాటలు, దేశభక్తి పాటలు మొదలైన పాటలను పాడతారు. ముఖ్యంగా వారు హోలీపండగ సందర్భంలో బృంద నృత్యం చేస్తూ పాడే పాటలు చాలా ఆసక్తికరంగా, ఆహ్లాదకరంగా ఉంటాయి.

నాకున్న పరిజ్ఞానంతో అనంతపురం జిల్లాలోని కొన్ని తాండాలలో నేను సేకరించిన బంజారాల పాటలు కొన్నిటిని పరిశీలిద్దాం. బంజారాల పాటలు వ్రాయడానికి, చదవడానికి కష్టతరంగా ఉంటాయి. అందువల్ల పాటలను వ్రాయడంలో తప్పులు దొర్లి వుండవచ్చు. విజ్ఞులు మన్నిస్తారని ఆశిస్తున్నాను, సవరిస్తారని విశ్వసిస్తున్నాను.

## బాలాజీ పాట (ఇంటి దేవుడు)

1. సాతే గఢేలా వాలో బాలాజీ
గఢేలాతోనా కోలారా బాలాజీ
సాతే మేటికి వాలో బాలాజీ
మేటికి తోనా కోలారా బాలాజీ
సాతేకోనేరి వాలో బాలాజీ
కోనేరి తోనా కోలారా బాలాజీ
సాతే గోపురాల వాలో బాలాజీ
గోపురాల తోనా కోలారా బాలాజీ
సాతే వాకిలీ వాలో బాలాజీ
వాకిలీ తోనా కోలారా బాలాజీ
హాతే మూటిరో పూల్ వాలో బాలాజీ

(చిన్నకుంట తాండా – కేశవనాయక్)

"ఏడు కొండలు గలవాడా ఓ బాలాజీ! ఆకొండలే నీకు సింగారం,
ఏడుమెట్లు గలవాడా ఓ బాలాజీ, ఆమెట్లే నీకు సింగారం,
ఏడు కోనేరులు గలవాడా ఓ బాలాజీ, ఆ కోనేరులే నీకు సింగారం,
ఏడు గోపురాలు గలవాడా ఓ బాలాజీ, ఆ గోపురాలే నీకు సింగారం,
ఏడు వాకిళ్ల (ద్వారాలు) గలవాడా ఓ బాలాజీ, ఆ వాకిళ్లే నీకు సింగారం,
చేతిలో పుష్పగుచ్ఛం గలవాడా ఓ బాలాజీ" అని లంబాడీలు తమ యింటి
దేవుడైన బాలాజీపై పాడిన పాట.

— (ఈ గేయంలో మెట్లు, కోనేరు, గోపురాలు, వాకిలి అనే తెలుగు
పదాలను యథాతథంగా ఉపయోగించినారు.)

## బాలాజీ పాట

2. మర ఝురు రేపర నీలీరో ఛాంటో
కుణనాకగో కుణనాక గోబాయి నీలీ ఛాంటో
శేవనాకగోబాయీ నీలిరో ఛాంటో
ఝుడమేలరే బై నీలీరో ఛాంటో
పులమెలరే బై నీలీరో ఛాంటో
ఫళ లగరే బై నీలీరో ఛాంటో
భోళోభరలో భోళోభరలో బై నీలీరో ఛాంటో

(కూడేరు తాండా – లక్ష్మణనాయక్)

దేవుని గుడి ముందు ఆడపిల్లలు సంతోషంతో నృత్యం చేస్తున్నప్పుడు సాధారణంగా వసంతాలు చల్లుకొంటారు. అప్పుడు 'నాయిక' (ఆ గ్రామ కుల పెద్ద భార్య) అక్కడికి వచ్చి చూచి ఈ రంగు చుక్కలను ఎవరు చల్లిరి, వేసిరి అని అంటే, బాలాజీ దేవుడే వేసినాడని, వరమిచ్చినాడని ఆడపిల్లలు నాయికతో చెప్పుట సారాంశం.

## ఇంటి దేవత సుంకలమ్మ పాట

3. సుంకి యాడిది మేజీ బందీ
మేజీఫల హేలో కోజా
రామణలక్ష్మణ హేలో కోజా
పెద్దమ్మ యాడిరి గంగిసీ గోడి
లంకాచేడిరి హనుమాన్
తోలజా యాడిరి గంగిసీ గోడి
లంకాచేడిరి హనుమాన్

(చిన్నకుబట తాండా – కేశవనాయక్)

"సుంకులమ్మ గుడి ఉంది. ఆ గుడి ముందు ఒక చెట్టు ఉన్నది. ఆ గుడిముందు రామలక్ష్మణులు నిధానంగా పోయారు. పెద్దమ్మ గుడి ఉంది. ఆ పెద్దమ్మ గుర్రం మీద ఎక్కింది. లంకలో ఆంజనేయుడు ఉన్నాడు. తొలసమ్మ దేవత ఉంది. ఆ తొలసమ్మ గుర్రంమీద ఎక్కింది" అని వారి యింటి దేవతలైన సుంకలమ్మ, పెద్దమ్మ, తొలసమ్మలను ప్రార్థించుట ఈ గేయ సారాంశం.

4. సాముసమణక గరస్యభంవో భాయంరో పాలేణో
పాలేణేమా సేవ బేటో
బేటాబేటో మూంగ పరోమో
భాయంరో పాలేణో

సాముసమణక గరస్యభందో భాయంరో పాలేణో
పాలణేమా దాద బేటో
భాయంరో పాలేణో
బేటా బేటో లేకో లేరో
భాయందో పాలేణో

సాముసమణక గరస్యభందో భాయంరో పాలేణో
పాలణేమా మేరమ యాడి చేటి
భాయందో పాళేణో
బేటా బేటో పూజ లేరీ
భాయంరో పాళేణో

(మర్తాడు తాండా – కేశవనాయక్)

మన ఊరి ముందు గుడి ఉంది. ఆ గుడిలో కులదైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తూగుటుయ్యాలలో ఉన్నాడు. ఆ దేవుడు తూగుటు య్యాలలో కూర్చొని మేము భక్తితో సమర్పించే పూజల అందుకొంటున్నాడు అని భావిస్తున్న సందర్భంలోనిది.

అదేవిధంగా వారి ఇతర కుల దేవతలైన మరియమ్మ, సుంక లమ్మలను కూడ పూజిస్తారు.

— (ఈ పాటలలో హింధీ పదాలైన బేటా, బేటిలు వాడటం విశేషం)

5. బాయీయో అఖివాళోవిసరో అదోణిదేశేన
బాయీయో అయివాశేరికారే సరియా పోవేరి
బాయీయో కారేరి ఘేరన బౌమిక్యామో ఝుగేరా
బాయీయో ఝుఘరమో ఝూగరమోర్ఝుడగే వాకమోరేగే
బాయీయో మేరమ యాడి నిసరీ బళ్లారిదేశేన
బాయీయో మేరమరో సాడో సారియాసోనేగో
బాయీయో సాడరి ఘేరన బౌమిక్యామో ఝుగేరా
బాయీయో ఝుఘరమో ఝుడగే నాకమోరేగే

(మర్తాడు తాండా – కేశవనాయక్)

బాలాజీస్వామి ఆదోని ప్రాంతానికి వెళ్లినపుడు ఆయన ప్రయాణం చేసిన బంగారు రథానికిచుట్టు (ఇరువైపుల) వెండిగజ్జలు పొదిగింపబడినాయి. ఆ రథం పోయే వేగానికి ఆ గజ్జలు ఊడి రాలిపోయినాయి అదేవిధంగా వారి కులదైవాలైన తొలజా, మరియమ్మ మొదలైన దేవతలను ఊహించుకొని పాడే పాట.

6. బాలాజీ మటేపర్ ఝాడ్ కాషెరో
ఝాడ్ కాషెరో బాలాజీ ఝాడ్ నాళదేరోవియో బాలాజీ
నాళి రచే చఢే శ్రీరామ బాలాజీ
యాజి కేరియా మరియా యాడిరో పూజ
యాజే వషగీ యాడి తారి వషతిమా
యాజి కేరియా సేవాలాల్ పూజ

(పెడబల్లి తాండా – లక్ష్మణనాయక్)

బాలాజీ గుడి మీద ఏమి చెట్టు ఉంది. అది కొబ్బరి చెట్టు అయి ఉండవచ్చును. నీ పూజకై కొబ్బరికాయను సమర్పిస్తున్నాం. శ్రీరామచంద్ర స్వరూపమైన ఓ బాలాజీ! ఈరోజే నీకు పూజ చేస్తాం. ఓ మరియమా (ఆదిశక్తి) ఈ రోజు మేము నీసేవకై వేచి ఉన్నాం. ఈరోజే చేస్తాం సేవాలాల్ పూజ అని వారు భక్తి భావంతో పాడుకొన్న పాట.

## నృత్యపు పాట

7. బాపూ దసే గంటారీ రాతే వద రీచ
బాపూ భాయి భజాయిన నిదే లాగరీచ
బాపూ రతడి ముడీరో కుకదా భోలోచ
బాపూ హరే ఘళే క్యామా కోవేల బోలోచ
బాపూ దొళ దడియామా మోర ఝురాచ

తెల్లవారజాము అవుతాంది, గుడి గంటలు మ్రోగుతున్నాయి. వదిన మాత్రం నిద్రపోతాంది. ఎర్రమూతి కోడిపుంజు కూస్తాంది. కాని వదిన మాత్రం నిద్రపోతాంది. అదే విధంగా కోవెల, నెమళ్లు కూడా కూస్తున్నాయి.

— పల్లెటూళ్లలో కోడి కూయగానే అందరూ (స్త్రీ పురుషులు) నిద్ర నుండి లేచి వారి వారి ఇంటిపనులు లేదా దైనందిక కార్యక్రమాల్లో లేదా పనుల్లో నిమగ్నమై పోతారు. ఈ పాటలో గుడిగంటలు మోగుతున్నాయంటే దేవునికి అభిషేకం, జలు జరుగుతున్నాయి, అందువల్ల మీరుకూడ పనిపాటలు చేసుకొండని హెచ్చరించినట్లుంది.

పెండ్లి కుమార్తె స్నానం చేసేటప్పుడు ఆమె అక్కాచెల్లెండ్రు పాడేపాట

8. లాయలాయే లాడ లాయ లాయే తారే
పగలే హేట గంగ వేయీజా! యో
ధుజమతలాడ ధుజమతయో తారి
రాజరేబేటా సరికి తారిబాయి హుబీచ

(పందికుంట తాండా – లక్ష్మీరాంనాయక్ & రాధాబాయి)

ఓ చిన్నారి చెల్లీ! నీవు స్నానం చేస్తుంటే ఆ నీరు గంగలా పారుతాంది. ఆ నీటిని చూచి నీవు భయపడవద్దు. నీ చుట్టు రాజకన్యల్లాగ మీ అక్కాచెల్లెండ్రందరం గుంపుగూడి ఉన్నాం అని చెల్లెలకు అక్కాచెల్లెండ్రందరు ధైర్యం చెప్పుతున్నారు.

## పెండ్లికుమారుని తరపువారు పెండ్లి కూతురుపై పాడేపాట

9. గోళటోప రేరి ఘలిమేలి అంగిడి
వెతడున దుబళో కరమేలి
బాయి సరే మఘేని
ఘిమో ద్వాదేరి ఘలిమేలి అంగీడి
నవతారిన తాజి కరమేలి
బాయీ సరే మఘేని

(పందికుంట తాండా – లక్ష్మీరాం నాయక్, & రాధాబాయి)

పెండ్లి కుమారుడు పెండ్లి చేసుకొని పెండ్లి కుమార్తె ఇంటి నుండి తిరిగి తన ఇంటికి వచ్చినప్పుడు అక్కడ పెండ్లి కుమారుని అక్కా చెల్లెండ్లు (బంధువులు) మా పెండ్లికొడుకు బాగా చిక్కి పోయినాడని చెప్పే సందర్భంలో పాడేపాట :–

మీ ఊరిలో బెల్లం, కొబ్బరి చౌకగా దొరుకుతుంది గదా! అయినా మా పెండ్లి కుమారునికి మీరు తినబెట్ట లేదా? ఏమి? ఎందుకు ఈ విధంగా బక్క చిక్కి పోయాడు, మీకు సిగ్గులేదా?

అంతేగాకుండా మీ ఊరిలో పాలు, నేయి సమృద్ధిగా దొరుకుతున్నందున మీ పెండ్లి కుమార్తెకు మాత్రం బాగా తినబెట్టి ఆమెను చాలా లావు చేసారు. ఈ విధంగా చేయడానికి మీకు సిగ్గులేదా? అని వారు చెప్పి పాడివారు.

## పెండ్లికొడుకు స్నానం చేసేటప్పుడు వారిచెల్లెలు పాడేపాట

10. ధుజమతలాడ ధుజమతరే తారే రిడియా
సరిక తార భియ హేబీచ
ధుజమత దూలధుజమతరే
తారే బామణి సరికితారిభేన హుబీచ
ధుజమతలాడ ధుజమతరే తారే రెడజాసరిక
తారియాడి హేబీచ !

(పందికుంట తాండా – లక్ష్మిరాంనాయక్ & రాధాబాయి)

పెండ్లికొడుకును ఉద్దేశించి వారి చెల్లెలు అతనికి స్నానం చేసేటప్పుడు శరీరానికి పసుపు పూస్తూ నీవు భయపడవద్దు, ఎందుకనగా రెడ్డిలాంటి మాఅన్న నీదగ్గర ఉన్నాడని, అదేవిధంగా బ్రాహ్మణ కన్యలాంటి నీ చెల్లెలు, రెడ్డమ్మలాంటి మా అమ్మ నీదగ్గర ఉన్నారని – అందువల్ల నీవు భయపడవద్దని చెల్లెలు తన అన్నకు ధైర్యం చెప్పుట ఈ గేయ సారాంశం.

## పెండ్లికూతురు పాడేపాట

11. మతో తోదో నాయికనే యాడి
మరి నాయకన యాడి హాతేరో
బాజో బూజో మూటియా
మతో తోడో నాయికనే యాడి
కాడో చోనే తయారి, భేటి విరాణి వచ్
అజేతి తయారి భేటి విరాణివచ్
మేతో కోదో బియా విరాణి గరేరి విరాణి కాడే
తమానా కోదోచ్ తయారిబేటి విరాణివచ్

(రామగిరి తాండా – సీతాభాయి)

ఆడపిల్లను పెండ్లికూతుర్ని చేసేటప్పుడు తనకాలి పూసలు తెంప వద్దని అన్నను, పెద్దలందరిని అడుగుతుంది. ఈ పూసలను తెంపితే నన్ను వేరేయింటికి సాగనంపడానికి కదా మీరు ఈ పూసలను తెంపేది. అన్న ! నేను మీతో కలిసిమెలిసి ఇన్నిరోజులు తిరిగాను. ఈ దినం నుండి నన్ను మీ నుండి ప్రక్కకు (వేరే ఇంటికి) పంపడానికి కదా నాపూసలను మీరు తెంపుతున్నది. అన్నా ! నన్ను వేరే ఇంటికి పంపవద్దండి ! కాలి పూసలను తెంపవద్దని పెండ్లికూతురవుతున్న ఆడపిల్ల బాధపడుట ఈ పాటలోని సారాంశం.

పెండ్లికూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు స్వయంగా పాడేపాట

12. మారేజె నామోకే బాపూరీ హవేలి
హరీ రేస హరీ వాళి నంగేరి
కనాదే కూంజానా, హరీరేసీ హరీ వాళి నంగేరి
ఝురలాజు ఫేలేస, వడలాజు వదేస హవేలి
తారేజ భుంగలామ ఘూలనగా కలరే నాయకే బాపు
హనుమానే భీయా, అజేతితారీ
ఖెనడ నేరాణి వేగిరే భీయా
ధోభీరా ధారాయో భీయా
దర్జీరో సీడావో హనుమానే భీయా
బుదేగి జాంగియా రాభీయా
కాంయీాజే నారదాయి కరేవరే
హనుమానే భీయా

(కొట్టాలపల్లి తాండా – సీతాబాయి)

పెండ్లికూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు అక్కడి తాండాను, నాన్న, అమ్మను మరియు అన్నలను ఉద్దేశించి పాడినపాట.

ఓ నాయనా ఈ ఊరు, ఊరిలోని వారు నేను ఎప్పుడు చూచినా పచ్చగా ఉండాలి. మేడిపండ్లలాగా, మర్రిచెట్టు ఊడల్లాగా పాకిపోవాలి. నాన్నా! నన్ను అత్తవారింటికి పంపకుండా నీతల పాగలో పెట్టుకొని దాచుకో!

ఆదేవిధంగా అన్నలను ఉద్దేశించి అన్నా! నీచెల్లెలు ఈ రోజు నుంచి ఇల్లు విడిచి వెళ్లి పోతున్నది. మీరు అందరూ కలసి నన్ను పరాయి దాన్నిగా చూస్తున్నారు. అమ్మా నీవు అయినా నాన్న, అన్నలతో చెప్పి నన్ను అత్తవారింటికి పంపకుండ చూడమని చెప్పిన సందర్భంలోనిది.

## పెండ్లికూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు స్వయంగా అమ్మ నుద్దేశించి పాడినపాట

13. ధోశేజ హంగులేరి యాడి
పిశేన భూరియారి యాడి
తారేజ దూదీయా పేటేమా
ఘలాన గోకలమో
నాయకణ యాడి
అజేతి తారి బేటి
నెరేణి వేగియో
నాయకణ యాడి !
మాడీజ నంగరీన కికేన భూలాజావురే
నాయక బాపూ
యోగావే డీరో, నాగీయా
బళాదేరో హరణ కిం కేన
భూలాజావురే బాపూ
మారికేతర వావేడి కనాదే కూజన
హరిపురి రకా దేసరే బాలాజి
మారే బాపూన యాడీన
హరే పూరేతి దేకలరే ! సేవా !
మారీ భీయారీ ఘరీయాణ
దూదే దాకలా దేకలరే ! సేవా !

(కొట్టాలపల్లి తాండా – సీతాబాయి & ఉమ్లానాయక్)

అమ్మా ! నన్ను అత్తవారింటికి పంపుతున్నారే ! నేను అక్కడికి ఎలా పోయేది. ఈరోజు నుండి నీకూతురు ఇల్లువిడిచిపోతాంది. ఈ ఊరిని నేను ఏవిధంగా మరచిపోయేది. మన ఇంటిలోని ఆవు, ఎద్దు (నాగ్యా అనే పేరుతో పిలువబడే ఎద్దు) తోట, చేను, పూల వనం - వీటినన్నింటిని ఎలా మరచిపోయేది. అయినా నేను పోకతప్పదు. మా ఇంటిదేవుడైన ఓబాలాజీ ! పైవాటినన్నింటిని నీవు అయినా చల్లగా కాపాడు, మా అన్నగారి ఇల్లు పాలుపొంగే విధంగా చల్లగా చూడుమని ప్రార్థించింది.

ఈ రెండు పాటలు అత్యంత మనోహరమైనవి. ఇవి కాళిదాసు శృంగార శాకుంతలాన్ని గుర్తుకు తెస్తాయి.

## పెండ్లిపాట

14. ఒడమాకి ఎతుడీపర్ బేటి
ఎతుడీరో సాబో లియాని మాకి
ఓడ జోని మాకి
ఓడమాకి నవలే రీపర్ బేటి
నవలేరి సోబో లియాని మాకి
ఓడజోని మాకి
ఓడమాకి జలరేపర్ బేటి
జులరేర్ సోబో లియాని మాకి
ఓడజోని ఓడమాకి నాయకేపర్ బేటి
నాయకే మత్‌రో లియాని మాకి
ఓడజోని మాకి

(షేక్‌సానిపల్లి తాండా – క్రిష్టానాయక్)

తేనెటీగ పెండ్లికుమారుని మీద, పెండ్లికుమార్తె మీద, పెండ్లి కొచ్చిన జనం మీద, వారి కులపెద్ద అయిన నాయకుని మీద వాలింది. అది చూచిన నాయికి (నాయకుని భార్య) వారి క్షేమ సమాచారాలు తెలుసు కొని వచ్చి నాతో చెప్పమని తేనెటీగకు చెప్పింది.

## పెండ్లి సమయంలో పెండ్లికూతురికి కావలసిన సొమ్ములు కొనడానికి పోయేటప్పుడు పాడేపాట

15. భురియా మెలాయి ఏ ధనసన మంగలి
లాలిగరది వడే ఘిణి కోవల బాయి
హాసలో మెలాయి ఏ ధనసన మంగలి
లాలిగరది వడే ఘిణి కోవల బాయి
గొలుసు మెలాయి ఏ ధనసన మంగలి
లాలి గరది వడే ఘిణి కోవల బాయి
కోల్ద మెలాయి ఏ ధనసన మంగలి
లాలి గరది వడే ఘిణి కోవల బాయి

(నరసాపురం (నాగులగుడ్డం) తాండా — లక్ష్మణనాయక్)

ముక్కుపోగు, వెండి మెడకడియం, వెండి గొలుసులు, కాళ్ల కడియాలు మొదలైనవి కొనడానికి పోయేటప్పుడు సుకుమారమైన కోయిల కంఠం గల పెండ్లికూతురు ఎర్రచేని తోవలో నడుస్తున్నప్పుడు ఎర్రదుమ్ము లేస్తూఉందని ఈగేయ సారాంశం.

## పెండ్లి కూమారుని చేతికి కంకణం కట్టేతప్పుడు పాడేపాట

16. సమ సాంజేరో బాజో
డోరణో కీ భూటే లాడిడో రణో
తారే బాపేరో హతేరో
బాజో డోరణోకి భుటలాడి డోరణో!

(ఉదిరిపికొండ తాండా – క్రిష్ణానాయక్)

పెండ్లి కుమారునికి అన్నదమ్ముల వరుసగలవారు రాత్రి 8 గంటల ప్రాంతంలో చేతికి కంకణం కట్టుతారు. అదే రాత్రి ఒంటిగంట ప్రాంతంలో పెండ్లికుమారుని బావమరదుల వరుసగలవారు విప్పుతారు. అట్లు ఒకరు కట్టిన ముడిని మరొకరు విప్పకపోతే వారు ఓడిపోయినట్లు భావిస్తారు.

— (ఇది ఎదుటివారిని అపహాస్యం చేయడానికి ఉపయోగపడే చర్య.)

## పెండ్లి పాట

17. డాన్ కాగే మాటలా రడాగే
లాబ్‌సీ పీనె మాటలా రడాగే
పంచమేళు బాహ్మణ డొడొర మాడాగే
కటుమాళ లకేతి సెపార మాంగాయి
కటుమాళ బాబేనా సారీరాత్ చబాయి
కటుమాళ లకేతి పాన్ మాంగాయి

(చిన్నకుంట తాండా – సోమేనాయక్)

పెండ్లిలో అన్నం తిని పాత్రలను పారేసిరి. పరమాన్నం త్రాగి బాణలను (అండాలను) బోర్లించిరి. నాయీ బ్రాహ్మణులు దండోరాకొట్టి పోయారు. కటుమాళ అనే ఊరినుండి ఆకులు, వక్కలు తెప్పిస్తిమి. పెండ్లికొచ్చిన వాళ్ళు రాత్రి అంతా వక్కాకు వేసుకొన్నారు.

## నృత్యగేయం

18. ఎలబాయి నీళా అలగింద నీళా
గాడి చడే నీళా బస్సు చడే నీళా
గాడి చడాకతో రోయేచ్ నీళా
బస్సు చడాకతో హాసీచ్ నీళా
ఎలబాయి నీళా అలగింద నీళా
బళ్లియా పేరేకతో రోయేచ్ నీళా
బంగిడి పేరేకతో హాసీచ్ నీళా
పేటియా బాందేచి కతో రోయేచ్ నీళా
సాడో బాంద్ కతో హాసీచ్ నీళా

(చిన్నకుంట తాండా – సుంకులాభాయి)

'నీళా' అనే అమ్మాయి ఎద్దులబండి ఎక్కమంటే ఏడుస్తుంది. కాని బస్సు ఎక్కమంటే నవ్వుతుంది. దంతపుగాజులు తొడుక్కోమంటే ఏడుస్తుంది కాని మట్టి గాజులు తొడుక్కోమంటే నవ్వుతుంది. పావడా (లంగా) కట్టుకోమంటే ఏడుస్తుంది. కాని చీర కట్టుకోమంటే నవ్వుతుంది. అని ఈ పాట సారాంశం.

— ఈ బాలిక పురాతన మనః ప్రవృత్తిని మార్చుకొని, ఆధునిక మనః ప్రవృత్తికి అలవాటుపడిందని భావన.

## తపలాకొట్టి నృత్యం చేసేపాట

19. యాగం బాగం కోవల బోలి
కోవలేన మారలో పాటలీమా గాలలో
కోవల బోలియే బాగేమా
యాగం బాగం కోవల బోలి
కోవలేన మారలో కొనిచ్ఛామ గాలలో
కోవల బోలియే బాగేమా
యాగం బాగం కోవల బోలి
కోవలేన మారలో ముటియామ గాలలో
కోవల బోలియే బాగేమా

(కొట్టాలపల్లి తాండా – నారాయణ్ నాయక్)

"అడవిలో వనమందు కోయిల కూస్తుంది. దానిని చంపి ఒడిలో వేసుకో, కోయిలకూత కూస్తుంది. వనంలో దానిని చంపి వీపువెనుక కట్టుకో. కోయిల కూత కూస్తుంది. దానిని చంపి చేతిలో పట్టుకో". అని పాట సారాంశం.

— ఈ పాట భావం ఎట్లున్నా ఇది లయబద్ధంగా ఉన్నందున వాళ్ల దీనిని నృత్యం చేసేటప్పుడు పాడతారు.

## చెల్లెల్ని అత్తవారింటికి పంపేటప్పుడు అక్క పాడినపాట

20. తురో మత్ యా సారుబాయి
    దీనే చయే బొంబాయి వాలేన్
    కలకోని మాయ బాపెనీ
    ససురో మలో బాపేతాన్
    సేదాలియే బేటితాన్
    రోమాతయే సారుబాయి
    దీనే చయే దూరదేశ్
    సాసుమాయి మాయతాన్
    సేదాలియే బేటితాన్

(రామగిరి తాండా – సీతాబాయి)

"నిన్ను బొంబాయికి ఇచ్చినారని సారుబాయి నీవు ఏడ్వవద్దు. చాలా దూరమని మన తల్లిదండ్రులకు తెలియదు కాబోలు! నీకు తండ్రి లాంటి మామ దొరికాడు. ఆయన నిన్ను తనకన్న బిడ్డలాగ చూస్తాడు. మీ అత్త కూడ నీకు తల్లిలాంటిది. ఆమె నిన్ను తనకన్న కూతురులాగ చూస్తాది" అని అక్కచెల్లెల్ని బుజ్జగిస్తూ పాడేపాట.

## తిరుగలి పాట (ఘట్టీర్ గీత్)

21. సూతియే జటానీ భాయి
దేవర బేడువ పాతర కాడో
సాసువ విజలి కడకడన బోలి
ససరోయి రాజీయా యాంకన బోలి
జేట హటిలో జోయి మాంగో
సాసు జూటో కాగడో మతవాంచో బామన
ఏ భాయియో వాడియా మరే కిలా చరతోచ్
వాడ పరేకిలా గియాతోరి భాయియో
ఏ భాయియో అజే మారీ బాపురీ సరశివాట్
సోయ్యే కోస్పేపర్ బీలే బేమి భాయియో
వాడియా మరేకిలా చరరోచ్

(సింగంపల్లి తాండా, కూడేరు మండలం – జమునాబాయి)

తోడికోడండ్రు ఇద్దరు పండుకొని ఉంటారు. లేవమ్మా అక్కా! అత్తగారు తిడతారు. గింజలు విసరుదాం. ఓ అక్కా! కోడి కూసింది లేయి మన మరది చాలా చెడ్డవాడు, అత్త రాక్షసి, మామ మంచివాడు, బావ చాలా రోషవంతుడు, ఆయన తన భాగం పంచియ్యమంటాడు" అని తోడి కోడండ్రు గింజలు విసరేతప్పుడు పాడేపాట.

## నాట్లపాట

22. ఛోఛో మైనా మేడి ఖణాయి
లాసేరియా భేనడ రోవతీజా
ఛోఛో మైనా నారఘులాయి
లాసేరియా భావజ రోవతీజా
ఛోఛో మైనా మేడి నాటాయి
లాసేరియా పాతణ రోవతీజా
ఛోఛో మైనా మేడి కలపాయి
లాసేరియా దేవర రోవతీజా
ఛోఛో మైనా మేడి కటాయి
లాసేరియా వీరా రోవతీజా

(నరసాపురం తాండా – హనుమానాయక్)

సాధారణంగా పల్లెటూళ్లల్లో రైతులు సంవత్సరానికి ఒకసారి పంటలను నాటటం, కలుపుతీయటం పరిపాటి. మడి దున్నేటప్పుడు ఆపనికి విసుగుచెంది ముద్దుల చిన్న చెల్లెలు ఏడుస్తూ ఉంది. అలాగే పంటకాలంలో పనిచేసి చేసి అలసిపోయి వదిన, మరది, భర్త, పాలికాడు – వీరందరూ పాడినపాట.

## కోతలపాట

23. రాళేగ్య కాటుంతో లారే లారే నాణిక్య
ఊనణొక్యా సోతార భళ కతాజ్యా
మడి కాటుంతో లారే లారే నాణిక్య
ఊనణొక్యా సోతార భళ కతాజ్యా

(మర్రాడు తాండా – కేశవనాయక్)

తెల్లవారకముందే కొర్రగడ్డి, వరిమడి కోయడానికి పోతున్నప్పుడు సాధారణంగా ఒంటరిగా ఉన్నవాళ్లు తమ చిన్నపిల్లలను కూడా ఎత్తుకొని పోతారు, ఆ సందర్భంలో పెద్దవారు కోస్తున్నప్పుడు పిల్లలు వారి వెంట బడతారు. ఆ దృశ్యాన్ని కళ్ళకట్టినట్టు వర్ణించేపాట ఇది.

## జోల పాట

24. హాలో బాయి హాలో
సోజోవో బాయీ సోజో
బాయినా కూణ మరో
బాయిరీ అంకి మానిందే ఆయో
బాయి సోన జోళీమా
సిబ్బి సోన వాడేమా

(పాలెంతాండా — గౌరిబాయి)

నిద్రపో పాపాయి నిద్రపో
పాపను ఎవరో కొట్టారు
పాప కంటికి నిద్ర వస్తొంది.
పిల్లిలా ముండ్లపొదలలో నిద్రపోతూంది.

పాప నిద్రబోయేది ఉయ్యాలలోనని, కాని పిల్లి నిద్రబోయేది ముండ్ల పొదలలోనని జానపదులుపోల్చి చెప్పడమేగాక, పసి పిల్లల నిద్ర పిల్లినిద్ర లాంటిదని చెప్పిన వారి భావన అత్యంత సుందరమైనది.

— పిల్లి చాలా సేపు నిద్రపోదు. ఇది అందరికి తెలిసిన విషయమే కదా!

## జోల పాట

25. హాలో కరుంచు యాడినా
సోజో కరుంచు బయా
తేరి యాంకియా నీందే ఆవో బాపూ
హాలో కరుంచు తోన్ నీందే ఆవో సోజో బాపూ

(చిన్నకుంట తాండా — సుంకులాబాయి)

నేను జోకొట్టుతాను, హాయిగా నిద్రపోనాయనా. నీ కళ్లకు నిద్ర బాగా వస్తొంది, బాగా పండుకోమ్మని తల్లిబిడ్డను జోకొట్టుతూ పాడినపాట.

## దేవర (జాతర) సమయంలో పాడేపాట

26. జీంఘులా జీంఘులా వాజా వాజో
డెంకో పడబోయే భవాని తారో తేవార
జీంఘులా జీంఘులా వాజా వాజో
డెంకో పడబోయే భవాని తారో తేవార
సేవారే మూండే అంగే మూంగా మోగరే జాడ్
మూంగా తొలసిరే జాడ్ మూంగా పోరోలే సోనో తొలరే
మేరియారే మూండే అంగే మూంగా మోగరే జాడ్
మూంగా తొలసిరే జాడ్ మూంగా షోరోలే బేనాద్ సోనాతొలలే హుసా
మేరి యారే కేపాళ పరే అడో టీ కోరేంగ చడీజాయో
వాయ్‌రో జూలర్ నాబా రోచ్

(నరసివేకుంట తాండా – లాల్యానాయక్ బృందం)

ఈ దినం శుభదినం దేవర పూజను చేస్తున్నాం. ఈ జనాన్ని చల్లగా పాడుమని భక్తితో పూజచేస్తున్నాం. నీగుడి ముందు ఏదో చెట్టు ఉండాదనుకుంటే అక్కడ తొలసిచెట్టు ఉంది. ఓ తొలసమ్మ తల్లి ఈ రత్నాలన్నీ హారంగా కూర్చుకో. ఈ రత్నాల తూకం బంగారం తూంచుకో అని దేవతను ప్రార్థిస్తే, ఆ దేవత ఈ దినం మనకు నొసటబొట్టు పెడతాదని అడ మగ అందరూ సంతోషంగా భజనచేస్తూ, నృత్యం చేస్తూ పాడేపాట.

## దేశ నాయకురాలు ఇందిరాగాంధీపై పాడేపాట

27. అనంతపురం జిల్లా సారి మారో యే మాది
ఇందిరా యే గాంధీ దొరే దొరే బూరియా వాళియే
మాది ఇందిరాగాంధీ

ధర్మారం జిల్లా సారి మారోయే మాది
ఇందిరా యే గాంధీ దొరే దొరే హాసలే వాళియే
మాది ఇందిరాగాంధీ

పామిడి జిల్లా సారి మారోయే మాది
ఇందిరా యే గాంధీ దొరే దొరే గొలుసు వాళియే
మాది ఇందిరాగాంధీ

ఉరవకొండ జిల్లా సారి మారోయే మాది
ఇందిరా యే గాంధీ దొరే దొరే మూటియా వాళియే
మాది ఇందిరాగాంధీ

(షేక్‌సానిపల్లి తాండా - క్రిష్టానాయక్ బృందం)

అనంతపురం, ధర్మవరం, పామిడి, ఉరవకొండ మొదలైన ఊళ్లు (పట్టణాలు) మావే అన్నట్లు, వాటిని ఏలేది (పాలించేది) మా తల్లి ఇందిరాగాంధీ అనీ, మా ఇందిరాగాంధీ ఎట్లున్నదనగా బంగారు ముక్కు పోగు, వెండి కడియం, వెండి గొలుసులు వేసుకొన్నది మా ఇందిరాగాంధీ అని వాళ్ళు ఇందిరాగాంధీని ఉద్దేశించి పాడినపాట.

— ఈ పాట కట్టిన లంబాడీకి జిల్లా, తాలూకా అనే బేధమే లేదు. తాలూకాలు, పట్టణాలను కూడ జిల్లాలుగా చేసి వర్ణించాడు. నిరక్షరాస్యులు కాబట్టి ఇట్లు చేయడంలో వింతలేదు. ఇందిరాగాంధీకి తమ వేషం వేసి వర్ణించుకోవడం యిందులో విశేషం. శిల్పకళలో యిట్టి ఘటనలు కోకొల్లలు.

28. చోడ కీనా జాన్ ధీట్ వాట్
అయో కోని నరాసి
లకడీ జాన్ ధీట్ వాట్
బారో బాందన్ ధీట్ వాట్
అయో కోని నరాసి మై దీట్ వాట్
నీంద్ కీంక్ అయిరే
ఆంకీ రేనే నేయో
ఈ రాత్ కస అయిరే
ఈ ఆంకీరే భమరాన
యో దేవరియ గుంగటో
దేరాడ్ ఓడలేన్ ఆవురే వాల్
తారి మారి మేరే జీ గమగోరే వాల్
దేవేరియా భూరియా కుటూపరే వాల్
గాలరే ఆవురే వాల్
తారి మారి మేరేజీ గమగోరే వాల్

(రామగిరితాండా, పామిడి మండలం – సీతాబాయి)

ఒకనాటి రాత్రి భర్త భార్యతో కట్టెలు కొట్టడానికి అడవికి పోదామని చెప్పాడు. ప్రొద్దున్నే భార్య భర్తను లేపగా, కంటికి నిద్ర వస్తాంది, నీవు పొమ్ము, నేను వస్తానని చెప్పి, అట్లే నిద్రపోయాడు. ఆమె అడవికి పోయి కట్టెలను కొట్టి, మోపు కట్టినా ఎంతసేపటికి భర్త రాలేదు. ఆమె అతనికోసం ఎదురు చూచి, ఎదురు చూచి కట్టెలమోపు ఎత్తుకొని ఇంటికి వచ్చింది. అంత ఆమె భర్తతో నీవు వస్తానని చెప్పి రాలేదు, నీవు ఎంత పాపిష్ఠి వాడవు అని అడుగుట ఈ పాట సారాంశం.

## కూతురు అగచాటు పాట

29. ఏయా చున్నురా బాటా కతరాకు పాడు
బోటిల లట్టూ పూరి పరోచ్
బాపు బాంద్రోచ్ యాడిరో రీచ్
గటేలారి లకడి కతరాకు పాడు
బోటిల లట్టూ పూరి పరోచ్
బాపు బాండ్రోచ్ యాడిరో రీచ్

(సంజీవపురం తాండా - లక్ష్మీబాయి)

ఎన్నిదినాలు సున్నపురాళ్ళు ఈవిధంగా మోస్తాను. సున్నపురాళ్ళు మోసి మోసి నాతల మీది వెంద్రుకలు జడలు కట్టినాయి. అదే విధంగా కొండలో నుంచి కట్టెలను ఎన్నిదినాలు మోస్తాను. కట్టెలను మోసి మోసి నా తల మీది వెండ్రుకలు జడలు కట్టినాయి అని బిడ్డ తన తల్లిదండ్రులకు చెప్పగా, ఆ బిడ్డ పడే బాధను చూడలేక తల్లి ఏడుస్తుంటే తండ్రి తిట్టుతున్నాడని ఈ పాట సారాంశం.

— తండ్రి ఆమె కర్మకు ఆమెను వదలిపెట్టమని దీని సారాంశం.

30. సాతి బాయి ఎకిళి బేనడు
మోహుసున గావుడిమా మేళో
దోళి గావుడి టాంగ్ తుడిగీచ్
హారటి పారటి తారిబేన్ బాబేటి
మోహుసున కోరుటేన మేలువతో
కోరుట కేవతి కచేరిన మేలువతో కచేరి కేవతి

(సంజీవపురం తాండా – సుశీలాబాయి)

ఏడుమంది అన్నలకు ఒక చెల్లెలు ఉంది. అత్తింటివారు ఆమెను ఆవులను కాయడానికి పంపిరి. అక్కడ కొండలో తెల్లఆవు కాలు విరిగింది. అందుకు అత్తింటి వాళ్ళు ఆమెకు కష్టాలు పెట్టారు. ఆమె అన్నలు చెల్లెలు కష్టాలను చూచి అత్తింటి వారిని కొట్టడానికి పోగా, చెల్లెలు అన్నలతో పార్టీలు (తగాదాలు) మనకొద్దు, కోర్టుకు (కచేరికి) పోయి మనం గెలుస్తాం అని చెల్లెలు తన అన్నలతో చెప్పుట ఈ పాట సారాంశం.

**పెండ్లి సమయంలో గ్రామ పెద్ద అయిన నాయకుని దగ్గర కూర్చున్న పెండ్లి కూతురుపై పెండ్లి కొడుకు చెల్లెలు పాడేపాట**

31. వ్యార ఘుంగేలా పాంచ కరేలా
బేటియో మారిదే వలజీ
దేవలజి రోమాలయో ఆవో ఘుంగటో కడీ మరిదేవులజీ
దేవలజి రో ససరో యో
ఆవో లాజ కరే మరిదేవలజీ
వ్యార ఘుంగేలా పాంచ కరేలా
బేటియో మరి దేవలజి
దేవలజి రో సాసు ఆయి
లాజకరే మరి దేవలజీ
దేవలజి రో దేవర ఆవో
జపగిరే మరిదేవలజీ

(ఎద్దులపల్లి తాండా – సోమ్లానాయక్)

పెండ్లి సమయంలో గ్రామ పెద్ద అయిన నాయకుని దగ్గర మా అన్నను చూచి పెండ్లి కూతురు సిగ్గు పడతాందని ఛలోక్తిగా, హాస్యభరితంగా చెప్పడం, అదే విధంగా పెండ్లికూతురు ఆమె అత్త, మామ, మరది మొదలైన వాళ్లను చూచి సిగ్గుపడుతాందని చెప్పడం ఈ గేయ సారాంశం.

## చీరను వర్ణిస్తూ నృత్యపు పాట

32. తెరికాట సాడో బాంద లీది మామ
జలలీది వాట జలమేరి యాడి
దెకదెక వాట జూరరే మామ
జలమేరో బాపు దెకదెక వాట
తేరి కాట సోళి పెరలీది మామ
జలలీది వాట జలమేరి బావచ్
దెకదెక వాట జూరరే మామ
హతే వాచీ బాందలీది మామ
జలలీది వాట జలమేరి భావచ్

(నరసినేకుంట తాండా – లాల్యాలాయక్ బృందం)

ఆమె మంచి టెరికాటన్ చీర కట్టుకొని ఈ సంసారం నాకు వద్దు, బయటికి వెళ్లి పోతానని చెప్పితే ఆమె తల్లి ఏడుస్తుంది, తండ్రి కూడ భాధ పడతాడు. అదే విధంగా ఆమె టెరికాటన్ వోళి తొడుగుకొని, చేతిలో గడియారం కట్టుకొని ఈ సంసారం నాకు వద్దు, బయటికి వెళ్లిపోతానని చెప్పితే ఆమె తల్లి ఏడుస్తుంది, తండ్రి కూడ భాధపడతాడని చెప్పుట ఈ పాట సారాంశం,

33. ఎగేల బగేల సరక్తో టాఖర కువ వానేడి భరీచ !
వవేడిమ అలోనిలో పాణి భర కువ వానేడి భరీచ !
బాగేమ ఎక్రఝుండ పులభ రేపుల దేవు నచడీభ
ఎకసీర ఘాలా సిజరోచ
పుజ కరజు లగాచ !
గూతితి యాడి పాప యామకేచ
పుజ కరజు లగాచ !

(పాలెం తాండా – రామానాయక్)

ఒక అడవిలో కోట ఉంది. ఆ కోట లోపల పాడుపడిన బావి ఉంది. ఆ బావి నిండా పాచిబట్టిన నీళ్లుండాయి. అక్కడికి సమీపంలో ఒక వనం ఉంది. ఆ వనంలో పూలచెట్లనిండా పూలు ఉన్నాయి. ఆ పూలను కోసుకొని వచ్చి బాలాజీ దేవునికి పూజచేస్తాం.

34. తుగో తారే ఘీయా గుంటూరేన
తారి కాపీరి అంగేడి హతలేల
తారి కాపేర గల సీతి కాఫి పల
తార విలుకుటు వాలేతి ముండలూల
తుగో తారే కాకి అదోనేన
తారి దారూరి అంగేడి మహతలేల
తార కాళేరి గల సీతి దరూపల
తార సోనేరి టువలేతి ముండలూల

(కూడేరు తాండా – లక్ష్మనాయక్ & జమునాభాయి)

చెల్లెలు అన్నతో "అన్నా నీవు గుంటూరుకు వెళ్లినపుడు కాఫీ హోటలుకు పోయి కాఫీ తాగి సిల్కుగడ్డతో (టువాలుతో) మూతితుడుచు కొమ్మని చెప్పింది. అదే విధంగా ఆమె చిన్నాన్నతో చిన్నాన్నా! నీవు ఆదోనికి వెళ్లినప్పుడు సారాయి అంగడిలో సారాయి తాగి పట్టుపడ్డతో (శిల్కు శాలువాతో) మూతి తుడుచుకొమ్మని చెప్పింది.

## దీపావళి పండగ సందర్భంలో పెండ్లికాని ఆడపిల్లలు వేకువ జామున లేచి పూలుకోసి ఇంటి ముందర పెడతారు ఆ సమయంలో పాడేపాట

35. గోరిభారియో గోరియో తలవడిమ గజళోభ
గోరి భారియో నంగరేరో నాయక్ కిమగీచ
గోరి భారియో హరిమో పలేంగంపర్ సూతాచ
గోరి భారియో కేరేతో కారణేతి సూతాచ
గోరి భారియో నంగరేరి కారణేతి సూతాచ
గోరి భారియో గోరియో తలవడిమ గజళోభ
గోరి భారియో నంగరేరో నాయకణ కి మగీచ
గోరి భారియో హరిమో పలేంగంపర్ సూతాచ
గోరి వారియో కేరేతో కారణేతి సూతాచ
గోరి వారియో నంగరేరి కారణేతి సూతాచ

(కూడేరు తాండా – లక్ష్మానాయక్)

ఆ సందర్భంలో పెండ్లికాని ఆడపిల్లలతో పాటు ఆ గ్రామ నాయకుడు, నాయకి – వీరిద్దరూ వారితోపాటు ఉండాలన్న నియమం కలదట. కాని ఆ సందర్భంలో నాయకుడు, నాయకి కనిపించనందున వారు ఎక్కడికి పోయినారని అడుగగా, వారు ఏదో ఒక గ్రామ సమస్యతో అలిగి మంచం మీద పండుకున్నారని చెప్పుట పాటలోని సారాంశం.

36. జోజోని జోనీరా లకడీనా
యేయాడి మారోయే దండియాతీ మారోయే
జోజోని జోనీరా పానీనా
యేయాడి మారోయే గుడియాతీ మారోయే
జోజోని జోనీరా గోర్‌లిమా
యేయాడి మారోయే సింకాతి మారోయే
జోజోని జోనీరా బాటనా
యేయాడి మారోయే గుద్దలీతి మారోయే

(కూడేరు తాండా – లక్ష్మానాయక్)

నీవు అడవికిపోయి కట్టెలను మోసుకొని రమ్ము, లేకపోతే నిన్ను కట్టెతో కొడతాను. నీవుపోయి నీళ్లు తీసుకొనిరా, లేకపోతే నిన్ను కడవతో కొడతాను. నీవు గొర్రెలను కాయడానికిపో, లేకపోతే నిన్ను చిక్కెంతో కొడతాను, నీవు బాటపని (రోడ్డుపని) చేయి, లేకపోతే నిన్ను గుద్దలితో కొడతాను అని తండ్రి కొడుకును భయపెట్టి పనులను చేయించుకొనుట ఈ గేయ సారాంశం.

## భూస్వాముల మీద ఆడవారు పాడేపాట

37. మడి ఖణచ మడి నాటాచా
హాతే మా రాగి బాటిరే
సేవారి బేటి హం రామేరి నారిరే
లచ మణేరీ భోజయిారే
మడి ఖణచ మడినాటవా
హాతే మా భోడి ముద్దారే
సేవారి బేటి హం రామేరి నారిరే
లచ మణేరీ భోజాయిారే

(మర్తాడు తాండా – కేశవనాయక్ & సుశీలాబాయి)

మళ్లు కోసేటప్పుడు, నాటేటప్పుడు మాతో పనిచేయించుకొని మీరు మాత్రం (భూస్వాములు) వరి అన్నం తిని, మాకు మాత్రం పచ్చి కారం, రొట్టె, ముద్ద అన్నం మధ్యాహ్నం పూట పెడతారు. బాలాజీ కూతురులాంటి వారమనీ, శ్రీరాముని భార్యలాంటి వారమనీ, లక్ష్మణుని వదినలాంటి వారమనీ మీకు తెలియదా ఏమి? అలాంటి మాకు మీరు ఈవిధంగా పెట్టి, మీరు భోగ భాగ్యాలను అనుభవిస్తారని చెప్పుట ఈపాట సారాంశం.

— ఈ పాటలో 'మడి' అనే తెలుగు పదాన్ని కలుపుకోవడం విశేషం.

38. డావే ఖాలాతి పాణి
అవోయే రేవళి
రేవళి రో వాదర్ భీజ గోలాల్
భీజాతా భీజోతారే భాయి
ధానుడారి ఖబర్ మన్‌కి జోరే బాయి
ధానుడా భవుతో వగరేరో మోటో
తారే గళెమా కచో దోరారే ధానుడా
మారే గళెమా హీరామే తీర హర్
నంగరేరో వాయికేన్ హంకేన్ బోలియో
ధానుడారి మసక్ భందాదు మోలాల్

(నరసాపురం తాండా – తొలసిబాయి)

ఒక ప్రియురాలు తన ప్రియునికోసం అడవిలో వెదకుతూ పోతుండగా వర్షం వచ్చి ఆమె పైటకొంగు తడిసింది. అక్కడనే ఉన్న కొంతమంది ఆమెనుచూచి నీపైట తడిసిందని చెప్పగా, నాపైట తడిస్తే తడిసిందిగాని నాప్రియుడు ఎక్కడున్నాడో చెప్పమని అడిగింది. అంత అక్కడ ఉన్నవారు నీవు ఇట్లా పెద్దలకు తెలియకుండా ప్రేమించడం తప్పు అని మందలించగా, ఆమె నేను నా ప్రియుని మెడలో పసుపుదారం కట్టితే, అతడు నా మెడలో వజ్రాలహారం వేస్తాడని చెప్పింది. అందుకు వారు కోపించి నీవు ఈవిధంగా పెండ్లి చేసుకుంటే మేము మన నాయకునికి (కుల పెద్దకు) చెప్పి అతనిని కొట్టిస్తాము" అని చెప్పినారు.

## భార్యను భయ భక్తులతో పెట్టుకోమని చెల్లెలు అన్నతో చెప్పిన సందర్భంలో పాడినపాట

39. వాందా తారి బోరళి సిరాత్
ఘుమేకేన ఘుగరా వాజసారి రాత్
భీయ తారి నారేన హోటో రాకాడ్
హాతే మారే వాసలి ఫేరతో రాకాడ్
బాందా తారి బోరళి సిరాత్
ఝుమేకేన ఘుగరా వాజసారి రాత్
కాక తారి నారేన హెూటో రాకాడ్
హాతే మారే హాతీయార్ ఫేరతో రాకాడ్

(నరసాపురం తాండా – తాలసిబాయి)

చెల్లెలు అన్నతో మా వదినను రాత్రివేళ పండువెన్నెలలో గజ్జల సవ్వడిని విని అక్కడికి పోకుండా మందలించమని చెప్పుతూ, నీ చేతిలోని పిల్లనగ్రోవిని ఊపుతూ ఉండమని, అదే విధంగా చిన్నాయనను కూడా చేతిలో కొడవలి పట్టుకొని ఉండమని హెచ్చరించింది.

## భర్త అడవికి పోతూ భార్యతో గుడిశె దగ్గర జాగ్రత్తగా ఉండమని చెప్పిన సందర్భంలోనిది

40. ఖళియా ఖళియా మత్ హీండ ఝుమేరి
తోన దేకలియో రాజువల మాండిమో
నేది నేది మత హీండ ఝుమేరి
తోన దేకలియో రాజవల మాండిమో
గట్లి గట్లి మత హీండ ఝుమేరి
తోన దేకలియో రాజవల మాండిమో
గటలా గటలా మత హీండ ఝుమేరి
తోన దేకలియో రాజవల మాండిమో

(నరసాపురం తాండా – హనుమానాయక్ & తొలసిభాయి)

"నీవు వాగులు, వంకలు తిరగవద్దు. ఎందుకంటే ఈప్రాంతానికి వేటకు వచ్చిన రాజు నిన్ను ఎత్తుకొని పోతాడు. అదే విధంగా నీవు ఏరు, ఏటి గట్టున, కొండలు తిరుగవద్దని భర్త ఆహార సేకరణకై అడవికి పోతూ భార్యను గుడిశె దగ్గర జాగ్రత్తగా ఉండమని చెప్పిన సందర్భంలోనిది.

## ప్రేమ పాట

41. టీలేరి తాళి తితిరి జుంకో
మరితి తితిరీనా రంగ చడిరోచ్
గుత్తిరో డ్రైవరా డరలాగ రోచ్
చిన్నకుంటారో ఛోరీనా ప్రేమించ రోచ్

(చిన్నకుంట తాండా – సుంకులాబాయి)

గుత్తి డ్రైవరు స్టీలు పళ్లెం, చెవుల జుంకీలు, మరితీలు (కమ్మలు) తెచ్చియిచ్చి చిన్నకుంట గ్రామంలో ఒక అమ్మాయిని ప్రేమించాడు.

## భార్య భర్తపైన పాడేపాట

42. మార పాటరో ఫేటియరే చందుమామ
ట్రంకు పేటిమరే గారే చందుమామ
తు ఝులలాయో కానిరే చందుమామ
మదీటా కొనియో ఝులకే రాణి
ఇదే విధంగా — పాటరో పె పాటా
పడరేరో భాంటియా మొదలగునవి

(కొట్టాలపల్లి తాండా – సీతాబాయి)

భార్య పుట్టింటికి వెళ్లే సమయంలో భర్తతో తన బట్టలను మరచిపోయానని చెప్పగా, భర్త ఆమెతో నీవు ఎక్కడ దాచిపెట్టినావో నాకు తెలియదనగా, అంత భార్య భర్తతో ట్రంకుపెట్టెలో నాశిల్కు లంగాలో దాచి పెట్టాను, నీవు చూడలేదా అని ప్రశ్నించగా భర్త నీ శిల్కు లంగాను నేను చూడలేదు ఓ రాణి ! అని చెప్పిన సందర్భంలోనిది.

43. తిన పాలి చావళ్ తీసనకి భీయా
మారిభోళి భావజేనే వటాడో భీయా
కాచి పాకి నీద ఊటకొని బాయి
ఓరో నాను వాల రోవ వటాడో భీయా
బారపాలి ఘౌంవు తీసనకి భీయా
మారిభోళి భావ జేనే వటాడో భీయా
కాచి పాకి నీద ఊటకొని బాయి
ఓరో నాను వాల రోవ వటాడో భీయా

(నరసాపురం తాండా – లక్ష్మీబాయి)

ఒక చెల్లెలు అన్నతో "మూడు పాళ్లు బియ్యం నాలుగు పాళ్లు గోధుమలు పిండి విసరడానికి తీసిపెట్టాను. నేను ఒకాదానినే ఆ ధాన్యాన్ని విసరలేను. అందువల్ల పడుకొన్న మా వదినను లేపమని చెప్పగా, అన్న చెల్లెలుతో మీ వదిన వచ్చీరానీ నిద్రలో ఉంది, అనగా ఆమె ఇప్పుడే పండుకొన్నది. ఆమెను నిద్ర లేపితే లేస్తుందో లేదో అని చెప్పగా, చెల్లెలు సరే అటులయిన చిన్నబిడ్డ ఏడుస్తాందని చెప్పి లేప"మని సూచించింది.

— ఆమె తన వదినెకు కోపం కల్గించకుండా లేపడానికి వేసిన మంచి ఎత్తుగడ యిది.

## ఉయ్యాల పాట

44. అనంత పరేరి తేర భర్రాయి భీయా
తేరే మా కమిలే హుభిరే భీయా
కమలేరో హింజోళో ఘలమో భీయా
హింజళేమా భేనేన బెసరో భీయా
ఝుట ఝుట హలావో భీయా హింజోళో
మనడరే లాగజ భీయా హింజోళో

(కూడేరు తాండా – లక్ష్మానాయక్ & గంగాబాయి)

అన్నా చెల్లెలు ఇరువురు అనంతపురం తిరునాలకు వెళ్లారు. అక్కడ ఇనుప స్తంభాలకు కట్టిన ఉయ్యాల ఉంది. ఆ ఉయ్యాలలో అన్న తన చెల్లెలను కూర్చుండబెట్టి ఊపినాడు. అంత చెల్లెలు అన్నతో నన్ను మెల్లగా ఊపు, నాకు భయం వేస్తాందని చెప్పింది.

## పిల్లలకు అన్నం తినిపించేటప్పుడు పాడేపాట

45. ధానాన దనికి భాలే బాయి
    ఝుడ ఝుడ మెటీవే జో బాయి

(పాలెంతాండా – గౌరిబాయి)

తల్లి ఏడుస్తున్న తన పిల్లకు నేతి కలిపిన అన్నం తినిపిస్తూ బుజ్జగిస్తూ, ఆకాశంలోని చంద్రునివంక చూపిస్తూ అబ్బాయీ ! నేతితో కలిపిన వరి అన్నం బాగా తిని తొందరగా పెరుగు" అని, అంటోంది పిల్లలకు తల్లి అన్నం తినిపిస్తుండడం తెలుగునాట అందరూ కళ్లారా చూచినదే కదా!

## ఆడపిల్ల మనస్తత్వం

46. హాస్తి హాస్తి జాతే ఘరావా
    రోతి రోతి బుక్యా ఘర్ జావా

పెండ్లికాని ఆడపిల్లలను లంబాడీ జాతి అయిన 'జాతే' వారింటికి పిల్లనిచ్చినప్పుడు నవ్వుకుంటారని (నవ్వుకుంటు పోతారని) ఎందుకంటే వారి ఇంటిలో సుఖముంటుందని, అదే విధంగా 'బుక్యా' జాతి వారింటికి పిల్లనిస్తే వాళ్ళు ఏడుస్తారని (ఏడుస్తూ పోతారని), ఎందుకంటే వారి ఇంటిలో బాధ ఉంటుందని. బాధ పెడతారని ఈ పాట సారాంశం.

## సేవాభాయి కథ

బంజారాలు పూజించే దేవతలలో సేవాభాయి ఒకరని పాఠకులు ఇది వరకే గమనించి ఉంటారు,

సేవాభాయి తల్లి దండ్రులైన భీమానాయక్, ధర్మిణిభాయి మంగళూరు నుంచి బరోడాకు వలస పోయినారు. వీరికి మరియమ్మ కృపతో పిల్లలు కలిగారు. వారిలో సేవాభాయి ఒకరు. ఇతనిని పూజారిగా గ్రహించాలని మరియమ్మకు గొప్ప ఆశ కలిగింది. "నాకు దేవతలకంటే తల్లిదండ్రుల సేవయే ఎక్కువ" అంటూ సేవాభాయి వాదించాడు. ఒళ్ళుమండిన మరియమ్మ వాని యింటికి అగ్గి పెట్టింది. వాని నూరు అవులు అమె కోపానికి అహుతి అయినాయి, చాలామంది చనిపోయారు. అమె చచ్చిన వారి శవాలను పూడ్చడానికి కూడా అవకాశమీయలేదు. ఊరి పెద్దలంతా వచ్చి నీవు మరియమ్మ సేవచేసి తీరాలని సేవాభాయిని ప్రాధేయపడ్డారు. అలాగైతే ఆమె నాకు ఒకవరం ఇయ్యాలి. "14 తరాలు గడిచినా నా సేవ నడువాలి. నామాట జరగాలి" అని వరం కోరుకున్నాడు. మరియమ్మ అందులకు అంగీకరించింది. సేవాభాయి సుమారు 20 సంవత్సరాలు మరియమ్మను సేవించాడు. అతని మహిమ ఎక్కువ కాసాగింది. జనం మరియమ్మనే మరచిపోసాగారు. అమెకు కోపం వచ్చింది. బ్రహ్మచారి కావడంవల్ల ప్రభావశాలియైన వీనికి పెండ్లిచేస్తే కుదురుతుందని ఉపాయం పన్నింది. అ మాటే అతనిలో చెప్పింది. నేను బాయి, అందువల్ల అందరికి నేను అన్ననో, తమ్మునో్ అవుతాను, నేను ఎవరిని పెండ్లిచేసుకొనేది అన్నాడు. అమె మనుష్యులలో కాకుండా నాజాతి స్త్రీలనే తెస్తానన్నది. ఇద్దరికి గొప్ప వాదం నడిచింది, అతడు ఒప్పుకొనలేదు. అంత ఆమె అలౌకిక సుందరియైన దేవకన్యను తెచ్చి ఎదుట నిలిపింది. అతని మనస్సు చలింపలేదు. దేవుడు నాతండ్రి, ఈమె నాసోదరి అన్నాడు. నీవు పెండ్లి చేసుకోవి తీరాలి అని అమె పట్టు పట్టింది. చివరికి అతడు పార్వతీపరమేశ్వరుల దగ్గరకుపోదాము వారు పెండ్లిచేసికోమని అజ్ఞాపిస్తే అట్లేచేస్తానన్నాడు. ఇద్దరు గుడికి వెళ్లారు. అక్కడ తన అన్నలైన సుకాభాయి, జేతాభాయిలను పిలిచి వేపాకు

తెప్పించాడు. తనంత తాను లేచేంతవరకు ఎవరు ముట్టరాదని, తన సంగతి తల్లిదండ్రులకు చెప్పరాదని హెచ్చరించి వేపాకు మీద పండుకున్నాడు. అతన్ని పూర్తిగా వేపాకులో కప్పి ఒక మణుగు సాంబ్రాణి పొగ వేశారు. సేవాభాయి మరియమ్మ యిద్దరు మంచం నులకమీద కూర్చొని కైలాసానికి వెళ్లారు. అక్కడ శివుడు, పార్వతి, రామచంద్రుడు మెదలైన దేవతలంతా కూర్చొని ఉన్నారు. వారికి నమస్కరించి యిద్దరు తమ తమ వాదాన్ని వినిపించారు. రాముడు వాని తలవ్రాతను పరీక్షించి వాడు చెప్పింది సత్యమన్నాడు. మరియమ్మకు అవమానమైంది. గిరిక్కున తిరిగి భూలోకానికి వచ్చేసింది. మరియమ్మ అన్యాయం చేస్తుంది తొందరగా వెళ్లమని దేవతలు సేవాభాయిని తొందర పెట్టారు. మరియమ్మ సేవాభాయి తల్లిదండ్రులకు దగ్గరకు వెళ్లి మీ కొడుకు చచ్చి 3 రోజులయింది. సేవాభాయి తల్లి వచ్చి చూడగా అక్కడ భజన జరుగుతాంది. ఆమె పైన కప్పిన వేపాకు తొలగించ పోయింది. అందరు అడ్డగించారు. కొడుకు ముఖం చూచి తీరాలని ఆమె మొండిపట్టు పట్టి వేపాకు ముట్టుకున్నది. సేవాభాయి దేహం మూడుసార్లు ఎగిరి పడి ప్రాణం విడిచింది. జనమంతా మరియమ్మను అంగలార్చి వేడు కొన్నారు. సేవాభాయిని బ్రతికించు, పెండ్లికి మేము ఒప్పిస్తాము అన్నారు. మరియమ్మ పిలిచింది. సేవాభాయి వెనక్కురాలేదు. అతడు చచ్చింది "పోరాగడంలో". అది ఉమ్రీ అనే వూరికి ఒకటిన్నర మైళ దూరంలో ఉండింది. అక్కడఒక శ్రీమంతుని తోటలో నన్ను పూడ్చండి అవి వీణ తంతి లోకి వచ్చి సేవాభాయి చెప్పాడు. పోరాగడం వాళ్లు మా పొలిమేరలలో జరగాలిఅన్నారు. ఉమ్రీవాళ్లకు పోరాగడం వాళ్లకు జరిగిన కొట్లాటలో 25 మంది చచ్చారు. సేవాభాయి పాడే (శవమే) ఉమ్రీకి లేచిపోయింది. అక్కడ వేపాకు, వేపకట్టెలు, గంధం చెక్కలతో వానికి అగ్ని సంస్కారం జరిగింది. కాలుతూనే అగ్ని మద్యనుండి "గోర్, ఏగోర్. చమ్కేమత్" భయపడకండి ఇంక 12 ఏండ్ల తర్వాత నేను తిరిగివస్తాను. మీ గోర్ భాయి ఎక్కడెక్క-డున్నా అక్కడక్కడ సహాయం చేస్తాను. 12 ఏండ్లు గడిచాయి. అక్కడ గంగాసాగర్ అనే గొడ్డు గుర్రముండింది. 12 ఏండ్లు అవుతుండగా అది గర్భం ధరించింది. 12 ఏండ్లు కావడానికి ఇంకా 11 రోజులు ఉండింది. ఉమ్రీలో 18 మట్లు లోతు గల ఒక బావి దిన దినానికి ఎండిపోతూ ఉంది.

అది లాల్‌సింగు బావి. సేవాభాయి అతనికిలా చెప్పాడు. "12 ఏండ్లు ముగుస్తున్నాయి, నేను వస్తానని అందరికి చెప్పు;

నీ వెవరు?

నేను సేవాభాయి

నీవు వచ్చేందుకు గుర్తు?

ఇంక 9 దినాలకు నీ బావి నిండుతుంది

సేవాభాయి పోయి కాశీలో కొళాయి త్రిప్పాడు1. తొమ్మిదవ దినం బావి నిండి పారింది. అక్కడుండే జనమంతా కేకలు వేసారు. నర్తించారు, ఏడ్చారు, ధ్యానించారు. సేవాభాయి వచ్చాడు అన్నారు. మూడవ దినం గుర్రం మగ గుర్రపు పిల్లను ఈనింది. అయితే గుర్రపు పిల్ల గర్భంలోనే చచ్చి ఉండింది. దానిని దిబ్బలో వేసారు. సేవాభాయి లాల్‌సింగును లేపి మీరంతా నా సమాధి వద్దకు రండి అని చెప్పాడు. అందరు అక్కడికి పోయి చూస్తే 12 ఏండ్లనాటి చెడిపోయిన వాద్యాలన్ని "దడల్ దడల్" అని శబ్దం చేసాయి. సేవాభాయి వచ్చాడని అందరు తెలుసుకొన్నారు. అయితే అతడిని అక్కడి నుండి దేవాలయానికి పిలుచుకొని పోయేది ఒక సమస్య అయింది. మరల సేవాభాయి స్వప్నంలో చెప్పాడు. పూల పల్లకి తీసుకొని సమాధి దగ్గరకు పోండి. పల్లకితోబాటు అందరు సమాధి దగ్గరకు పోయి నూటొక్క (101) హోమం చేసి తిరిగి దేవాలయానికి తెచ్చారు. సేవాభాయి నీ కరుణ వుంటే చచ్చిన పీనుగ లేవనీ అన్నారు. దిబ్బలో పారవేసిన గుర్రపు పిల్ల లేచి నిలబడింది. అందరు దానికి పూల మాలలు వేసి పల్లకి ముందర తెచ్చారు. దానిని జేతాభాయికి, దాని తల్లియైన సుకాభాయికి ఇచ్చారు. గోర్‌భాయి భయపడవద్దండి, మీరంతా ఊరినుండి మైలు దూరంలో ఉండండి. కోళ్ళు, పందులు సాకవద్దండి, నూటొక్క వైద్యుల వద్దకు పోవద్దండి. చిటికెడు నా భస్మాన్ని సేవిస్తే అన్నిరోగాలు పోతాయని

1. ఈ గాథలో కొళాయిల ప్రస్తావన ఉంది. ఇది కూడ అత్యంత ఆధునికమైన సాధనమే.

అన్నాడు.నాటినుండి సేవాభాయి పూజ్యుడయ్యాడు. గుడిముందు 2 జెండాలు నాటారు. ఎర్రజెండా మరియమ్మది, తెల్లజెండా సేవాభాయిది. ఇవి అన్ని చోట్లా ఉండనీ, ప్లేగు, కలరా ఏమి వచ్చినా నేను ఉన్నాను అని ఒక పిల్ల వాని ద్వారా చెప్పాడు. ఉమ్రీ దగ్గర ఒక రైలు మార్గముండింది.2 దాని శబ్దాన్ని అతడు సహించలేక పోయాడు. అందువల్ల అతడు రైలు యింజను కీళ్లను కత్తిరించాడు. ఎంతసేపు ఏమి సరి చేసినా గాజులవలె "ఫలా పలా" మని సామాను రాలిపోతూ ఉండినాయి. ఇది సేవాభాయి మాయ అని ఉమ్రీ ప్రజలు అన్నారు. అక్కడి నుండి 6 మైళ్ళ దూరానికి రైలుమార్గం తీసుకొని వెళ్ళండి, లేకుంటే రైలు కదలదు. మీ యింజనులో నా గుర్తుగా ఎర్ర, తెల్ల జెండాలుండాలి అన్నాడు. వారు అందుకు ఒప్పుకొనగా వెంటనే రైలు యింజను కీళ్ళు కలిసాయి, రైలు కదిలింది. నాటి నుండి ఈనాటి వరకు అక్కడ ఎర్రజెండా చూపిస్తే రైలు ఆగుతుంది. తెల్లజెండా చూపిస్తే రైలు కదులుతుంది.3 సేవాబాయి అందరిని రక్షిస్తూ ఉండాడు.

జై సేవాలాల్
జై మరియమ్మ

(పాల్యం తాండా – రామానాయక్)

2. ఈ గాథ భారతదేశంలో రైల్వేలు ఏర్పడిన తరువాతనే కల్పించబడిందని తోస్తుంది.
3. ఉమ్రీలో తెల్లజెండా చూపితే రైలు కదులుతుందని ఈ కథలో చెప్పబడింది. కాని ఆకు పచ్చజెండా చూపితే రైలు కదలటం మనం గమనిస్తాం. ఇట్లు ఎందుకు జరిగిందో తెలియదు.

## హునా సతి

రామజీ, అతని తండ్రి యిద్దరూ కల్లు తాగడానికి వెళ్లారు ఇద్దరూ ఒక కాసు కల్లు తాగి తిరిగి వచ్చారు. రామజీకి పెండ్లి నిశ్చయమైంది. కాని ఇంకా పెండ్లి చేయలేదని అతనికి కోపం వచ్చింది. ఆ కోపంతోనే అతడు పశువుల పాకలో గూటం దగ్గర పండుకున్నాడు (నిద్రబోయాడు). తండ్రి కొడుకులకు మాట మాట పెరిగి రామజీ గోనెసంచిలో పెండ్లిసామాను అంతా పెట్టుకొని, నేను పెండ్లి చేసుకుంటానని మామ గారింటికి బయలుదేరాడు. దారిలో ఎదురయిన అపశకునాలను అతడు నిర్లక్ష్యం చేసాడు. అడవిలో ఒక వెలగ చెట్టుక్రింద పులి నిద్రబోయి ఉండింది. అతడు ఊరకనే పోయివుంటే బాగుండేది కాని తాగిన మైకంలో "ఏ అడవి కుక్కా లే" అని లేపాడు. పులి ఊరకనేపో రామజీ అన్నది. కొంత వాదం జరిగి కొట్లాట ప్రారంభమైంది. ఎవరు మొదట కొట్టాలి? నిర్ణయించడానికి ఒక బండపైన ఉమ్మిచూసారు. రామజీ కోరుకున్న ప్రక్కన ఉమ్మి పడింది, రామజీ పులిని మొదట 3 సార్లు గుద్దినాడు. పులికి చలి జ్వరం వచ్చినట్లయింది. అయినా ఓర్చుకొని రామజీని కొట్టింది. ఒకేదెబ్బతో రామజీ చచ్చిపడిపోయినాడు. పులి వానిదేహంలో కొంత తిని వెళిపోయింది. ఇటువైపు రామజీకి ప్రియురాలైన హునాభాయికి రాత్రి వెలగచెట్టు క్రింద క్రింద రామజీ పులివాత పడ్డట్టు కల వచ్చింది. ఆకలలో ఆమె ప్రక్కనే నిద్రపోతున్న చెల్లెలు కేశాభాయిని లేపి ఆ రాత్రే 2 కడవలు మోసుకొని ఏటికి పిలుచుకొని పోయింది. ఇద్దరు తలా ఒక చెలమతీసారు. కేశాభాయి చెలమలో మంచి నీళ్ళు పడ్డాయి. హునాభాయి చెలమలో 25 ఆకులు, వక్కలు వచ్చాయి. వాటిని ఆమె వడిలో వేసుకొంది, ఇంకొకసారి తీస్తే టెంకాయ, మరోసారి హుక్కా, వేరొకసారి రామజీ పావడా దొరికాయి. ఆమె అన్నీ తీసుకొంది". తనకలను చెల్లెలకు చెప్పింది. కేశాభాయి కడవ ఎత్తుకొంది. కడవ దానంతటదే హునాభాయి పాదాలు, మోకాలు, నడుము, ఎద, భుజాలు, ఎక్కి తలమీద కూర్చుంది. అమె వెండ్రుకలలో ముత్తయిదుల కుచ్చులు ప్రత్యక్షమయ్యాయి. ఇంటికి వచ్చి కడవను

దించుకోమని తన అన్న దామ్లానాయక్‌ను అడిగింది. ఆమె వణకుతూ ఉండింది. నీకేమైంది అని అన్న అరిచాడు. పూజారిని పిలిపించారు. పూజారివచ్చి నాచెల్లెలకు గొప్ప పీడ వచ్చింది అని ముగ్గువేసి, నిమ్మకాయలు కోసి, గొర్రెను నరికి హునాభాయిని చెలకోలతో కొట్టాడు. నన్ను కొట్టవద్దు అని హునాభాయి బతిమాలాడింది. మొదటి దెబ్బతో పూజారి కన్నులు పోయాయి. నన్ను కొట్టవద్దు, కొట్టితే నీకొడుకు చస్తాడని చెప్పినా, పూజారి వినకుండా రెండవదెబ్బ కొట్టగా వాని కొడుకు చచ్చాడు. మూడవ దెబ్బతో మున్నూరు (300) పశవులలో విత్తనపు గిత్త (ప్రాయపు గిత్త) చని పోయింది. ఇది చూచి వాని భార్య భయపడి ఏడుస్తూ పారి వచ్చింది. జనమంతా భయపడి హునాభాయిని మొరపెట్టుకొన్నారు. హునాభాయి శాంతించి 5 శేర్ల బియ్యం చెల్లెలు ద్వారా పిండి చేయించుకొని, చెంబు, పెండ్లికూతురు సామాను తీసుకొని గజ్జలు కట్టుకొని చెల్లెలుతో బయలు దేరింది. అందరూ వెంబడిస్తూ అడవికి వచ్చారు. అక్కడ అన్నప్ప అనే కోమటి తనకు చిక్కిన ముంజేతి గాజులను ఆమెకిచ్చాడు అవి తన భర్తవని ఆమె గుర్తించింది. అక్కడ ఒక కపాలం పడి ఉండింది. అది నామగనిదని చెప్పింది. జనమంతా శవ సంస్కారానికి సిద్ధం చేసారు. ఆమె గంధపు కట్టెలు తెప్పించింది. 3 నెలల దూడను పట్టుకొని రండి అన్నది. అంతే సిద్ధమయింది. 5 శేర్లు పిండిని పాయసంచేసి 350 మందికి వడ్డించింది. వడ్డించడానికి పాలులేవని అన్నద్వారా 7, 8 కుండల నేయి తెప్పించింది. 3 నెలల దూడ నుండి పాలు పితికింది. భోజనమైంది, ఎవ్వరూ ఏడ్వవద్దండి, నాచింత వద్దు, నేను నామగనిలో ఐక్యమైపోతాను అన్నది. ఆమె అందరికి నమస్కారం చేసింది. అన్నకు పెండ్లి అయి 12 సంవత్స రాలైనా సంతానం కాలేదు. అన్న భార్యను పిలిచి "సంతానం అవుగాక" అని ఆశీర్వదించింది.

కట్టెల మోపుకు నిప్పు అంటించి నేయి పోసింది. మగని దేహంతో పాటు ఆమె చితిపైన కూర్చున్నది. ఎవ్వరూ ఏడ్వవద్దండి అని సమాధానం చెప్పి, ఆశీర్వాదం చేసింది. అక్కడి నుంచే ఆమె బడిలోని ఒక్కొక్క సామాను తీసి ఒక్కొక్కరి వైపు విసిరింది. దేహం కాలుతు కంఠం వరకు వచ్చింది, తల పగిలింది. హునాభాయి ఐక్యమై "సతి" అయింది. జనం దుఃఖంతో అక్కడినుండి కదిలారు.

(కూడేరు తాండా — లక్ష్మానాయక్)

# అనుబంధం

## ఆంధ్రరాష్ట్ర సుగాలి సంఘస్థాపన

ఆంధ్రరాష్ట్ర సుగాలీ ప్రథమ మహాసభ 1951 ఫిబ్రవరి 18 వ తేదీన గుంటూరు జిల్లా పెద్దవడ్ల పూడిలో జరిగింది. గౌరవనీయులైన మంత్రి శ్రీ గల్లూడ చంద్రమౌళి, హరిజనాభ్యుదయ శాఖాడైరెక్టరు శ్రీ భాష్యం అయ్యంగార్, అఖిల భారత మహిళా సంఘ కార్యదర్శి శ్రీమతి పెద్దాడ రామేశ్వరమ్మ, శ్రీ స్వామి యోగానందగురు, ఆచార్య రంగా, భారతీయ ఆదియజాతి సేవక్ సంఘ కార్యదర్శి శ్రీ డి. రంగయ్య హైదరాబాదు సోషియల్ సర్వీసెస్ శాఖ డైరెక్టరు శ్రీ కె. ఎ. గఫూర్, గౌరవనీయ కార్మికమంత్రి శ్రీ వి. బి. రాజు మొదలైన వాళ్లు ఈ సభను జయప్రదంగా జరగాలనీ కోరుతూ సందేశాలు, సలహాలు పంపినారు.

ఆంధ్రప్రదేశ్‌లోని నలుమూలల నుండి రెండువేలమంది ప్రతి నిధులు ముఖ్యంగా బొంబాయి, హైదరాబాదు, మైసూరు సంస్థానాలనుంచి సాంఘికసేవా ప్రముఖులు, కార్యకర్తలు వచ్చి సభలో పాల్గొన్నారు. మాజీ ఎం. యల్. ఏ. మైసూరు రాష్ట్ర బంజారా నాయకులైన శ్రీ జాతరసింగ్ నాయక్ జాతీయజండా ప్రతిష్టాపన చేశారు. బళ్లారి జిల్లా బంజారా సంఘా ధ్యక్షులు శ్రీ బి. శంకర్ నాయక్ సభకు అధ్యక్షత వహించారు. భారతీయ ఆదిమజాతి సేవక్ సంఘ కార్యదర్శి శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య మహా సభను లాంఛన ప్రాయంగా ప్రారంభించారు.

బొంబాయి వాస్తవ్యులు శ్రీ బి.జి. లయాని, మైసూరు నిమ్నజాతుల స్పెషల్ ఆఫీసరు శ్రీ యస్.బి. సుక్రేనాయక్ వారి రాష్ట్ర ప్రభుత్వాలు నిమ్న జాతులకు కల్పిస్తున్న సౌకర్యాలను గురించి స్వజాతి భాషలో వివరించారు. ఆదివాసి సంఘసేవకులు శ్రీ చిర్రాపూరి నాగభూషణా చార్యులు చిత్తూరు శ్రీ బి. రామానాయక్ శ్రీ కావూరి వెంకయ్య మొదలైన వాళ్లు సుగాలీల సమస్యలపై ఉపన్యసించారు. తదుపరి శ్రీ బి. శంకర్‌నాయక్

అధ్యక్షులుగా, శ్రీ వి. గోపాలరావు నాయక్ కార్యదర్శిగా ఎన్నుకొని 35 మంది సభ్యులతో ప్రథమంగా ఆంధ్ర రాష్ట్ర సుగాలీ సంఘం స్థాపింపబడింది.

ప్రథమ ఆంధ్ర రాష్ట్ర సుగాలీసంఘ ప్రారంభోత్సవ సమయంలో పాల్గొన్న సభ్యులు సుగాలీలను షెడ్యూల్డు జాతులకోవలో ( తరగతిలో ) చేర్చి, వారికి ప్రత్యేక సౌకర్యాలను కల్పించాలని, సి.టి. యాక్టుకు బదులు ప్రవేశ పెట్టబడిన అలవాటుపడిన నేరస్థుల చట్టాన్ని రద్దు చేయాలని, సుగాలీ విద్యార్థుల కోసం కొత్త వసతి గృహాల నిర్మాణానికి గ్రాంట్లు మంజూరు చేయాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ తీర్మానాలు చేశారు.

## *భారతదేశ స్థాయిలో బంజారాల సంఘ స్థాపన :—*

బంజారాల సంఘ ఉద్యమ చరిత్ర ఒక్క ఆంధ్రదేశంతోనే ఆగలేదు. మధ్యప్రదేశ్‌లో శ్రీ వి.పి. నాయక్ తన విద్యార్థి జీవితంలో రాజకీయ పరిజ్ఞానమార్జించి 1926 లోనే సంఘప్రచారం మొదలు పెట్టారు. అదే విధంగా శ్రీరాంసింగ్ బాణావతు బంజారాలతో విదర్భలో సేవా సంఘం స్థాపించారు. శ్రీజాతర్ నాయక్ 1928 లో మైసూరు సంస్థానంలో రాష్ట్ర బంజారా సంఘాన్ని స్థాపించారు. అలాగే హైదరాబాదు, ఖాండేష్ లలో కూడా సంఘాలు స్థాపింపబడినాయి.

1. 1954 జనవరి 19, 20 తేదీలలో తొర్రూరు గ్రామంలో హైదరాబాదు స్టేట్ లంబాడీ మహాసభ జరిగింది. అదిలాబాద్ వాసి శ్రీ బలిరాం పటేల్ అధ్యక్షత వహించారు. మధ్యప్రదేశ్ డిప్యూటి రెవిన్యూ మంత్రి శ్రీ వసంతరావు పూల్సింగ్ నాయక్ (వి. పి. నాయక్) పాల్గొన్నారు.

2. 1954 ఏప్రిల నెల 11, 12, 13 తేదీలలో హైదరాబాదు స్టేట్ పర్భని జిల్లా, జింతూరు తాలూకా సోమ్‌గడ్‌లో ద్వితీయ భారత బంజారా సభలు జరిగినాయి.

3. ఆంధ్రప్రదేశ్ ప్రథమ బంజారా ప్రతినిధుల మహాసభ 1957 మే 5వ తేదీన హైదరాబాదు గాంధీభవన్‌లో సాంఘిక సంక్షేమ శాఖామంత్రి శ్రీ డి. సంజీవయ్యగారిచే ప్రారంభించబడింది. ఈ మహాసభకు దీవీలాల్ చౌహాన్ అధ్యక్షత వహించారు.

4. 1968 జనవరి 13వ తేదీన అనంతపురం జిల్లా పెనుకొండలో జిల్లా సుగాలీ సేవా సంఘ కార్యనిర్వాహక వర్గం సమావేశమైనారు. 1968లో ఫిబ్రవరి 3, 4 తేదీలలో అఖిలభారత బంజారా సేవాసంఘ జనరల్ కౌన్సిల్ సభలు శ్రీ ప్రతాప్ సింగ్ అధ్యక్షతన జరిగినాయి. ఈ సభకు శ్రీ వి. పి. నాయక్ సోదరుడు బాబాసాహెబ్ ప్రధాన అతిథిగా పాల్గొన్నారు.

5. 1970 జనవరి 10వ తేదీన గుంటూరు జిల్లా పెకెకెపాడు తాండాలో శ్రీ ఎ. గోప్యానాయక్ ఆధ్వర్యంలో బంజారా ప్రభుత్వోద్యోగులు సమ్మేళనమై తమ కనుగూలంగా ఉండునట్లు ఆంధ్రప్రదేశ్ బంజారా ఎడ్యుకేటెడ్ సమాజ్ స్థాపించారు.

6. 1971 ఆగస్టు 22 వ తేదీన మాచర్ల సమీపంలో గుబ్బలబోడు తాండాలో బంజారా ఎడ్యుకేటెడ్ సమాజ్ మహాసభ శ్రీ బి. రామానయక్ అధ్యక్షతన జరిగింది.

7. 1972 జూన్ 5 వ తేదీన మహబూబ్ నగర్ జిల్లా జడచర్ల వద్దగల గొల్లపల్లి తాండాల్లో నాల్గవ బంజారా విద్యావంతుల సమాజ్ మహాసభ గిరిజన శాఖామంత్రి శ్రీ కె. భీమారావుగారి అధ్యక్షతన జరిగింది.

8. అనంతపురం జిల్లా తనకల్లు "జిల్లా సుగాలీ మహాసభ" 24-9-77 న జరిగింది. ఈ సభకు గౌరవనీయ మంత్రులైన 1. శ్రీ అప్పుడుదొర (గిరిజన సంక్షేమశాఖ) 2. పి. నరసారెడ్డి (రెవిన్యూశాఖ) 3. శ్రీ చల్లా సుబ్బరాయుడు (పురపాలకశాఖ) 4. శ్రీమతి లక్ష్మిదేవమ్మ విచ్చేసినారు. ఈ సందర్భంగా స్థానిక ఎం.ఎల్.ఏ. శ్రీ అగిశం వీరప్ప పాల్గొనగా

శ్రీయుతులు జి. స్వామి నాయక్, మేఘనాద్ చౌహాణ్, అమరసింగ్ లీలావత్, వి. గోపాలరావు నాయక్‌ల గారిచే స్థానికంగా చేయవలసిన పెక్కు అభివృద్ధి కార్యక్రమాలు మంత్రుల దృష్టికి తేబడినవి.

9. కర్నూలు జిల్లా ఆత్మకూరులో 17-6-79 న "సుగాలీ మహాసభ" పార్లమెంటరీ వ్యవహారాల కార్యదర్శి శ్రీ కె. ఇ. కృష్ణమూర్తి గారి అధ్యక్షతన జరిగింది. శ్రీ డి. రవీంద్రనాయక్ సభను ప్రారంభించారు. శ్రీయుతులు జి. స్వామినాయక్, శ్రీ వి. గోపాలరావు నాయక్ తదితరులు ఉపన్యసించారు.

## *బంజారాల సాంస్కృతిక కళామండలి*

బంజారా సమాజాన్ని సంస్కృతి, సాంఘిక, ఆర్థిక, విద్యా, సాహిత్య, నృత్యకళారంగాలలో అభివృద్ధి పరచుట, రేడియో, టెలివిజన్ నాటక రంగాల ద్వారా తమ సమస్యలు వెల్లడిచేయుట, దుస్తులు, అలవాట్లు ఆచార వ్యవహారాలలో మార్పులు తెచ్చుట, మంచి చదువరులను, సాంఘిక కార్యకర్తలను ప్రోత్సహించుట మొదలైన ఉన్నత లక్ష్యాలతో 1977 సంవత్సరంలో "ఆంధ్రప్రదేశ్ బంజారా సాంస్కృతిక కళామండలి"ని స్థాపించి, జూలై నెలలో రిజిష్టర్ చేయించి, 1-1-1978 న ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జస్టిస్ శ్రీ కొత్తపల్లి పున్నయ్య గారిచే ప్రారంభింపబడింది. ఈ సందర్భంలో రవీంద్ర భారతి మిని థియేటరులో జరిగిన సభకు శ్రీ యం. నాగముని నాయక్ అధ్యక్షత వహించారు. లయన్స్ ఇంటర్నేషనల్ క్లబ్ చేర్మెన్ శ్రీ హోంప్రకాశ్ టిబ్రెవాలా ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. కళామండలి కార్యనిర్వాహక వర్గంలో శ్రీ వి. గోపాలరావు నాయక్ అధ్యక్షులుగా, శ్రీ యల్. పాండు రాటోడ్ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

ఈ సంఘ కళాకారులచే అనేక రేడియో ప్రోగ్రాములలో జానపద గీతాలు, నూతన భజనపాటలు, నాటికలు, ఉపన్యాసాలు తెలుగు, హింధీ, బంజారాభాషలలో ప్రసారం గావించబడినవి. రాష్ట్రంలో బంజారా గిరిజన సమ్మేళనాలు, ఉత్సవాలు, సభలు, జరిగిన ప్రతిచోట కళామండలి ప్రోగ్రాములు నిర్వహిస్తూ బంజారా జాతిని చైతన్యవంతం చేస్తోంది.

## అనంతపురం జిల్లా గిరిజన తాండాలు — ఒక సమీక్ష

అనంతపురం జిల్లాలో గిరిజన తాండాలు కొన్ని వందలకుపైగా ఉన్నాయి. వీరు ఈనాటికి అభివృద్ధి చెందకుండా, నాగరికత సువాసనలను చవిచూడకుండా నికృష్ట జీవితాన్ని కొనసాగిస్తున్నారు. ఈ జిల్లాలో కొన్ని ప్రాంతాలలో కొంతమంది వ్యవసాయం చేసుకుంటూ జీవిస్తుండగా, ఎక్కువ మంది వ్యవసాయ కూలీలుగా, సున్నం, కట్టెలను గాడిదలపై వేసుకొని సమీప పల్లె, పట్టణ ప్రాంతాలలో అమ్ముకొని పొట్ట పోసుకుంటున్నారు, ఉదర పోషణార్థమై వారు ఎన్నో కష్టాలను అనుభవిస్తూ, ఊరికి దూరాన ఉన్న తాండాలలో వెలివేయబడిన బానిసలవలె జీవిస్తూ ఉండడం మనం కన్నులారా చూస్తున్నాం. ఈ పరిశోధకుడు జానపదుడు కాబట్టి జనపదాలలో నివసిస్తున్న బంజారాల దుస్థితిని కన్నులార చూచి వారి యొక్క పుట్టు పూర్వోత్తరాలను, సంస్కృతిని, సాంప్రదాయక ఆచార వ్యవహారాలను• సాహిత్యాన్ని ముఖ్యంగా వారి కొన్ని పాటలను వారినుంచి సేకరించి తన కున్న పరిమిత జ్ఞానంతో వెలుగులోనికి తెచ్చే ప్రయత్నం చేసాడు.

ప్రస్తుతం అనంతపురం జిల్లాలోని బంజారాల సాంప్రదాయక నృత్యాలను, వారు ఉపయోగించే సంగీతవాద్య పరికరాలను గూర్చి సంక్షిప్తంగా తెలియజేయడం జరిగింది.

బంజారాలు అధికంగా బృంద నృత్యాలే చేస్తారు. ముఖ్యంగా వీరు వివాహ సందర్భాలలో పాడే దవళాలు, మొలకల పున్నమి పాటలు (వీటిని "జాజర్ గీత్" అని వారి భాషలో అంటారు), పెండ్లి కూతుర్ని అత్తవారింటికి పంపేటప్పుడు పాడే శోకగీతాలు, హోలి పండుగలో తాండాల్లోని మొత్తం బంజారాలు గుంపుగా గూడి చేసే బృంద నృత్యాలు ప్రధానమైనవి. హోలిగీత్, నంగారాగీత్, హవేళిగీత్ మొదలైనవి వీరి జానపద గీతాలు. నంగారా నృత్యం, హోలి నృత్యం మొదలైనవి వీరి ప్రత్యేక నృత్యాలు.

అనంతపురం జిల్లాలో ఆడవారు బృందంగా గూడి చేసే నృత్యాలే ఎక్కువ. అయితే మగవాడు కూడా తలకు పాగా కట్టుకొని వాద్యాన్ని వాయిస్తూ లేదా తాళాలు కొడుతూ పాట పాడతారు. కాని మగవారు ప్రత్యేకంగా ఎలాంటి నృత్యాన్ని చేయరు. మోహరం పండగ సందర్భంలో మాత్రం మగవారు తప్పెట్లను కొట్టుకుంటూ అనేక భంగిమలలో నృత్యాన్ని చేస్తారు.

బంజారాలలో కూడ కొంత జానపద గేయసంపద ఉంది. ఇందులో పౌరాణిక, చారిత్రక కథలు, గేయాలు ఉన్నాయి. అంతేగాకుండా వీరికి వీర గాథలు (సేవాల్ భాయా కథలు), ఇతిహాసాలు, హాస్యగేయాలు, శ్రామిక గేయాలు, దేశభక్తి గేయాలు ఉన్నాయి. తమచుట్టు వున్న శిష్ట సంస్కృతిచే ప్రభావితులై వారు తమ భాషలో అనువదించుకొన్న (అల్లుకున్న) పౌరాణిక, చారిత్రక సాహిత్యం కూడా ఉంది. వీరు ముఖ్యంగా హెూలిగీత్, నంగారా గీత్, హవేళి గీత్ మొదలైన జానపద గేయాలను పాడతారు. సంక్రాంతి పండగ దినంనాడు వారు క్రొత్తగా పండించిన అనేక రకాలైన ధాన్యాన్ని తాండా ప్రజలంతా వారి దేవత వద్దకు తీసుకొనిపోయి ఆమెకు "భోగ్" అనే నైవేద్యాన్ని పెడతారు. అక్కడ బంజారాలందరు చేరి రెండు దినాలు నృత్యం చేస్తూ, పాటలను పాడుతూ, మిక్కిలి వేడుకతో సంబరంగా ఆ పండగను చేసుకొంటారు.

బంజారాలలో కథా సంగీతరూపాలు, హరికథ, బుర్రకథ మాదిరిగా ఉండే ఇతర రూపాలు కూడా ఉన్నాయి. వీరు హెూలి, ఉగాది పండగ సందర్భాలలో నలమహారాజు, సేవాల్ బాయ కథలను, మరియు కేతర బియా దేశాడ అనే బంజారాల పుట్టు పూర్వోత్తరాలను గూర్చి తెలిపే కథలను బుర్రకథ, హరికథల రూపంలో వారి భాషలోనికి అనువదించుకొని గేయ రూపంలో పాడుతూ, వచన రూపంలో కూడా చెప్పుతారు. ఈ బుర్ర కథను సుమారు 3 లేక 4 గంటలసేపు చెప్పుతారు. ఈ కథను ఒకరు చెప్పుతుంటే, ఇద్దరు లేక ముగ్గురు రాగాన్ని కలుపుతారు. ఒకరు 'నగారా'ను వాయిస్తుండగా, ఐదుగురు 'థాలీ' అనే తాళాలను వాయిస్తారు. ఈ కథలను చెప్పడానికి దాదాపు 10 మంది అవసరమవుతారు.

ప్రస్తుతం ఈ జిల్లాలోని లంబాడీలు ఆధునికత వైపు ఎక్కువ ఆసక్తి కనబరస్తునందువల్ల వారి వేష భాషలలో గిరిజనుల లక్షణాలు క్రమేణా తగ్గిపోతున్నవి. కాని పండుగ పబ్బం దినాలలో మగవారు తలకు ఎర్రటి పాగాను చుట్టుకొంటారు. ఆడవారు తమకు ప్రత్యేకమైన పావడా, రవికె, పూసల దండలు మొదలైన ఇతర ఆభరణాలను ధరిస్తారు. ఏనుగు దంతాలతో చేసిన కడియాలు, చిన్న గవ్వలు, పూసలు, అద్దాలతో కూర్చిన దుస్తులు వీరికి ప్రత్యేకం. వారి ముఖ్యమైన వాద్య పరికరాలు కంచు పల్లెం, ఢంకా, తప్పెట, థాలీ నగరా, జాంజర్ మొదలైనవి.

## 'అవేర్' సంస్థ కార్యకలాపాలు

ప్రభుత్వం గిరిజనుల సామాజిక ఆర్థికాభ్యున్నతికి ఎన్నో పథకాలు చేపట్టింది. ఎన్నెన్నో కార్యక్రమాలు ప్రారంభించింది. వారి ఆర్థిక భద్రతకు ఎన్నో చట్టాలు చేసింది. అయినా మన రాష్ట్రంలోనే అనేక ప్రాంతాలలో నివసిస్తున్న గిరిజనుల స్థితి ఏమంత మెరుగు కాలేదని చెప్పాలి. ముఖ్యంగా వారు గిరిజనేతర జాతుల దోపిడి బారినుంచి బయట పడలేదనే చెప్పాలి. ఇంకా "వెట్టిచాకిరి" అనే సర్పం వారిని వెంటాడుతూనే ఉంది. అంతే గాకుండా సమస్యల వలయం నుండి గిరిజనులకు విముక్తి కలుగలేదనే చెప్పాలి.

భారతదేశంలో నూటికి ఇరువది మంది హరిజనులు, గిరిజనులు అనాదిగా సంకుచిత ఆర్థిక, సామాజిక సూత్రాలకు బలైపోతున్నారు. మూఢ విశ్వాసాల నుంచి బయట పడలేక పోతున్నారు, ఫలితంగా వారు సమాజంలో అణగదొక్క వేయబడుతున్నారు. వారు ఆర్థికంగా దోపిడికి గురవుతున్నారు. ప్రభుత్వం ఒకవైపు సహాయ కార్యక్రమాలు కొనసాగిస్తున్నా, మరోవైపు అన్యాయాలు, అక్రమాల బారి నుండి తప్పించుకోలేక పోతున్నారు.

సమాజంలో అన్ని వర్గాల ప్రజలు చైతన్యవంతులై తమ హక్కులను, బాధ్యతలను సక్రమంగా క్రమశిక్షణతో నిర్వహించినట్లయితే అందరికి సాంఘిక న్యాయం తప్పక జరుగుతుంది. అయితే ఒక ప్రభుత్వం మాత్రమే కృషి చేసినంత మాత్రాన అయ్యేపని కాదిది. ఎన్నో స్వచ్ఛంద సంస్థలు. ఎంతమందో సంఘ సేవకులు తమంతకు తామే ముందుకు వచ్చినప్పుడే కొంతైనా న్యాయం జరిగే అవకాశం ఉంది.

మనదేశంలో హరిజన, గిరిజన వర్గాల అభివృద్ధికి 1975 లో ఏర్పడిన 'అవేర్' సంస్థ 1988 నాటికి ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళ నాడు, కేరళ, ఒరిస్సా, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో తమ కార్యకలాపాలను చురుకుగా కొనసాగించింది. గత 5 సంవత్సరాలలో మన రాష్ట్రంలో సుమారు 2500 గ్రామాలకు అవేర్ సంస్థ కార్యకలాపాలు విస్తరించాయి. అవేర్ సంస్థ కార్యకలాపాలు నేడు ప్రజా ఉద్యమంగా మారిందనే చెప్పాలి. ముఖ్యంగా ఖమ్మం జిల్లాలో ఈ సంస్థ కార్యకలాపాలు గిరిజనులను ఎంతగానో ఆకర్షించాయనక తప్పదు.



పేద ప్రజలను అణగద్రొక్కే దుష్టశక్తులలో మద్యపానం, మధ్య దళారీల దోపిడి, లంచగొండి తనం ముఖ్యమైనవి. వీటికి పరిష్కార మార్గాలు లభించినపుడే ఎక్కడో మారుమూల గ్రామీణ ప్రాంతాలలో నికృష్టంగా జీవిస్తున్న ప్రజలకు న్యాయం జరిగినట్లవుతుందని చెప్పడం అతిశయోక్తి కాదు.



మనరాష్ట్రంలో అవేర్ సంస్థ 1200 గ్రామాలలో చురుకుగా పనిచేస్తున్నది. ఈ గ్రామాలలో హరిజనులు, గిరిజనులు, త్రాగుడుకు స్వస్తి చెప్పుతామని వాగ్దానం చేయడంతో వారి జీవితాలలో నిజంగా నవోదయం జరిగినట్టుగానే చెప్పుకోవాలి.

ఆంధ్రప్రదేశ్‌లో అవేర్ సంస్థ కృషి వల్ల గిరిజనులు నేడు తమ పిల్లలను విద్యావంతులుగా తీర్చిదిద్దుకొనడానికి ప్రయత్నిస్తున్నారు. అప్పులు విరివిగా తీసుకొనడానికి అలవాటుపడి. వెట్టిచాకిరి కబంధ హస్తాల

లోకి నెట్టివేయబడిన ఈ గిరిజనులు నేడు చైతన్యవంతులై పొదుపు ప్రాముఖ్యాన్ని గుర్తించారు.

అవేర్ సంస్థ ఖమ్మం జిల్లాలో వ్యవసాయాభివృద్ధి, పశుపోషణ, కుటీర పరిశ్రమలు, ఆరోగ్యం, పరిసరాల పారిశుద్ధ్యం, సామాజిక బావులు, స్త్రీ శిశు సంక్షేమం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపిస్తోంది. తుఫాను, దుర్భిక్షం మొదలైన ప్రకృతి వైపరీత్యాలు సంభవించినప్పుడు కూడా ఈ సంస్థ చేస్తున్న కృషిని పలువురు విజ్ఞులు ప్రశంసించారు. అలాగే గిరిజన భూములను అన్యాయంగా ఆక్రమించుకొన్న గిరిజనేతరులపై గిరిజనుల తరపున అవేర్ న్యాయ విభాగం 1987 లో ఏర్పడింది ఈ న్యాయ విభాగం 1987 లో దాదాపు 1100 కేసులను చేపట్టి వారికి న్యాయం చేకూర్చింది.

"మనరాష్ట్రంలో అవేర్ సంస్థ 1986–87 లో దాదాపు మూడు వేల గ్రామాలలో నివసిస్తున్న పది లక్షల మంది గిరిజనులకు సహాయం చేసినట్టు, 1987–90 సంవత్సరాలలో మరో 50,000 మంది జీవన పరిస్థితులను మెరుగుపరచే ప్రణాళికను చేపట్టినట్లు కొత్తగూడెం డివిజనల్ పౌరసంబంధాధికారి శ్రీ జగన్మోహన్ రావు తెలిపారు". 15

ప్రస్తుతం అవేర్ సంస్థలో 700 మందికి పైగా ఉద్యోగులు పని చేస్తున్నారు. అంతేగాకుండా విద్యాధికులైన ఎంతోమంది ఇంజనీర్లు, లాయర్లు, ఉపాధ్యాయులు హరిజన, గిరిజన బడుగు వర్గాల్లో చైతన్యం కలిగించడం కోసం స్వచ్ఛందంగా అవేర్ సంస్థ ఆధ్వర్యంలో అవిరళ కృషి చేస్తున్నారు.

నవభారత నిర్మాతలైన బాపూజి, నెహ్రూ, అంబేద్కర్ కలలుకన్న గ్రామ స్వరాజ్య స్వరూప స్వభావాల మాటలు ఏమిటో గాని స్వచ్ఛందసంస్థయైన అవేర్ మాత్రం స్వయం నిర్ణయ మార్గంలో పయనిస్తూ హరిజన, గిరిజనుల అభివృద్ధికి కృషి చేస్తున్నది.

## బంజారాల అభివృద్ధికి కొన్ని సూచనలు

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత బంజారా జాతి పురోభివృద్ధికి ప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి పథకాలు, కార్యకలాపాలు తక్కువ అని చెప్పాలి. నేటి బంజారా రాజకీయ నాయకులును స్వజాతి సంక్షేమంకోసం అవిరళ కృషి చేస్తున్నారు.

ప్రభుత్వం నేడు గిరిజనులకు ప్రత్యేకంగా కోపరేటివ్ కార్పొరేషన్, ప్రత్యేక డైరెక్టరేట్, గిరిజన సాంస్కృతిక పరిశోధన మరియు శిక్షణసంస్థ, గిరిజన ప్రత్యేకశాఖ, ప్రత్యేక మంత్రి, గిరిజన ఫైనాన్స్ కార్పొరేషన్, ఇంటిగ్రేటెడ్ ట్రైబల్ డెవలప్‌మెంట్, మోడిఫైడ్ ఏరియా డెవలప్‌మెంట్ ఏజన్సీలను స్థాపించి, తగిన అభివృద్ధి ప్రణాళికలను అమలు పరుస్తున్నారు.

ప్రభుత్వం గిరిజనులకు కొన్నిచోట్ల సాగుభూములను ఇవ్వటమే గాకుండ, మెట్ట ప్రాంతాలలో పోడు వ్యవసాయాన్ని ప్రోత్సహిస్తోంది, గిరిజనులకు ఇండ్లస్థలాలు, కాలనీలు, వ్యవసాయపుటెద్దులు, బండ్లు, మేకలు, గొర్రెలు బ్యాంకుల ద్వారా ఋణాలు ఇస్తున్నారు. అంతేగాకుండా సామాజిక సేద్యపు నీటి బావులు, మంచినీటి బావులు, బోరింగు నీటి పంపులు, విద్యుఛ్చక్తి సరఫరా, రోడ్లు, పాఠశాలలు, వసతి గృహాలు, విద్యార్థులకు స్కాలర్ షిప్పులు మంజూరు చేస్తున్నారు. ఇప్పుడిప్పుడే బంజారా విద్యార్థులు అన్నిరకాల కోర్సులలో అభివృద్ధికివస్తూ, ఉన్నత ఉద్యోగాలలో చేరుచున్నారు. దీనికి ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజిల ద్వారా, పలు శాఖాధిపతుల ద్వారా న్యాయం సక్రమంగా అమలు జరుపవలసి ఉంది. అంతేగాకుండా ఉద్యోగాలు చేస్తున్న గిరిజనులకు ప్రమోషన్లు ఇచ్చుటలోను, డిపార్టుమెంటులో ఎర్పడిన ఖాళీలను, బేక్‌లాగ్ ఖాళీలను (కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల నిబంధనల మేరకు రిజర్వేషన్స్ పాటిస్తు) భర్తీ చేయాలి. పలు కోర్సుల విద్యా సంస్థలలో కూడా గిరిజనులకు రిజర్వేషన్స్ పాటించాలి.

సాంకేతిక నిపుణులైన గిరిజన అభ్యర్థులు ఇతర దేశాలలో ఉన్నతవిద్య అభ్యసించడానికి ప్రభుత్వం వేతనాలిచ్చి ప్రోత్సహించాలి. గిరిజన విద్యార్థులకు స్కాలర్ షిప్పులు మంజూరు చేయడంలో తల్లిదండ్రుల ఆదాయంలో ఎట్టి పరిమితి పెట్టరాదు.

ప్రభుత్వం మారుమూల తాండాలు, గూడెంలన్నిటిలో అభివృద్ధి కార్యక్రమాలు, పథకాలు చేపట్టాలి. తాండా కేంద్రాలలో కొన్ని ఆశ్రమ పాఠశాలలను నెలకొల్పాలి. వైద్య సదుపాయాలను మెరగు పరచాలి. గిరిజన వృత్తులను ప్రోత్సహించడానికి తగినంత ఆర్థిక సహాయం మంజూరు చేయాలి. గిరిజన గ్రామాలలో కల్లు. సారా అంగళ్ళు పెట్టడానికి అనుమతించరాదు.

స్థానిక స్వపరిపాలనా సంస్థలైన పంచాయితీలు, మండల ప్రజా పరిషత్తులు, జిల్లా ప్రజా పరిషత్తులు, మునిసిపాలిటీలు, అసెంబ్లీ, పార్లమెంటు ఎన్నికలకు గిరిజనులకు రిజర్వేషన్స్ ఇచ్చినందువల్ల నేడు కొంతమంది రాజకీయ రంగ ప్రవేశంచేసి, పదవులలోకి రాగలుగుతున్నారు. వీరందరు స్వార్థం వీడి, హృదయ పూర్వకంగా తమ స్వజాతీయుల శ్రేయస్సుకు కృషి చేస్తే బాగుంటుంది కాని, స్వలాభం కోసం పేరుగొప్ప ఊరు దిబ్బలా వ్యవహరిస్తే జాతి పురోభివృద్ధి కుంటు పడుతుంది. కావున బంజారాలలో విద్యావంతులైన యువతీ యువకులు, ఉద్యోగస్థులు, ప్రభుత్వం, స్వచ్ఛంధ సంస్థలు, రాజకీయ నాయకులు నిస్వార్థంగా పని చేస్తే వచ్చే దశాబ్దానికి బంజారాలు అభివృద్ధి చెందగలరని చెప్పుట అతిశయోక్తి కాదు.



# పాద సూచికలు

1. ఆంధ్ర సర్వస్వం — ఆదిమవాసులు - లంబాడీలు, పుటలు 110 - 111
2. The Mysore Tribes & Castes, Vo. 2 L.K.A. Iyer, p. 135 & 136
3. ఆంధ్రప్రభ - దినపత్రిక - ఆదివారం - 8-7-1990 - లంబాడీలు- కేశావత్ సోమ్లాల్.
4. The Mysore Tribes & Castes, Vol. 2 - L.K.A. Iyer p. 139
5. ఆంధ్ర సర్వస్వం - లంబాడీలు, పుట 111
6. The Mysore Tribes & Castes, Vol. 2 - L.K.A. Iyer, p. 153 & 154.
7. Blitz - December 9, 1989
8. Levy, Sylvian : In the Introduction to the Mysore Tribes & Castes - edited by Nanjundaiya, H.V. & Anantha Krishna Iyer
9. Tribal life in India - Bose, Nirmal Kumar p. 66.
10. Indian Society - Sharma, Ramnath p. 104.
11. Races & Cultures of India - Majumdar, D. N., p. 355
12. The Affairs of a Tribe ; - A study in Tribal dynamics - Majumdar, Dhirendranath, p. 10.
13. గిరిజనులపై మన ఆలోచన మారాలి - ప్రొఫెసర్ నిర్మల్ సేన్‌గుప్తా' ఆంధ్రప్రభ - దినపత్రిక - ఆదివారం ప్రత్యేక సంచిక.
14. గిరిజన సామాజిక వ్యవస్థ-ఖండిక-5 పాఠం – 16, పుటలు 50-51.
15. ఆంధ్రప్రభ - అడవులలో చిరుదీపాలు - బి. కిరణకుమార్, 27-7-1988.

# ఆధార గ్రంథాలు

## తెలుగు : —

1. ఆంధ్ర సర్వస్వం - సంపాదకులు - మాగంటి బాపినీడు, కొండపల్లి వీర వెంకయ్య & సన్సు, రాజమండ్రి, 1961.

2. ఆంధ్రుల జానపద విజ్ఞానం - డా॥ ఆర్వీ. యస్. సుందరం, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు. 1983.

3. ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - ఖండవల్లి లక్ష్మీరంజనం, బాల సరస్వతీ బుక్ డిపో, కర్నూలు, 1957.

4. జానపద నృత్యకళ - డా॥ చిగిచెర్ల కృష్ణారెడ్డి, జానపద యువకళాకారుల సంఘం, సుబ్బారావుపేట, 1989.

5. తెలుగు బాలగేయ సాహిత్యం - డా॥ యం. కె. దేవకి, పండువెన్నెల ప్రచురణలు, 1983

6. తెలుగు బాలగేయ సాహిత్యం - డా॥ బి. రామరాజు, జానపద విజ్ఞాన ప్రచురణలు, హైదరాబాదు, 1978.

7. తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహించిన రాష్ట్రస్థాయి, జానపద కళోత్సవాలు, ప్రత్యేక సంచిక, 1990.

8. నా జీవిత యాత్ర - వి.జి. నాయక్, 1989.

9. భారతదేశంలో సమాజ నిర్మాణం మార్పు, ఖండితలు 4 - 9 ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం. హైదరాబాదు, 1989.

10. విజ్ఞాన సర్వస్వం - సంపుటం 3 & 4 - తెలుగు భాషాసమితి, హైదరాబాదు.

11. సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశం - సంపుటం 2 & 5, సంపాదకులు మామిడిపూడి వేంకటరంగయ్య, 1964 & 1966.

# ENGLISH

1. Indian Society — Ramnath Sarma, Media Promoters & Publishers Private Ltd. Bombay, 1981.

2. Introduction to the Mysore Tribes & Castes-Nanjundaiya & Anantha Krishna Iyer.

3 Races & Culture of India — D. N. Majumdar, Asia Publishing House, Bombay, 1958.

4. Society in India — J. L. Kachroo & Vijay Kachroo, Cosmos Book hive (P) Ltd., New Delhi, 3rd edition 1981.

5. Tribal life in India — Nirmal Kumar Bose, National Book Trust, New Delhi' 1971.

6. Tribal Development — Directed change & Voluntary action — A case study of Koya — Tribal Village Velluballi, Warangal District (A. P.) M. Phil Thesis by R. D. Prasad, S.K. University, 1989.

7. The Affairs of a Tribe — A study in tribal dyamics, D.N. Majumdar, Universal Publishers; Lucknow, 1950.

8. The Mysore Tribes & Castes — Volume - II L. K. A. Iyer Mittal, Publicat ions, Delhi, Reprinted 1988.

